# రత్నావళి



కృతికర్త.

విద్వాన్, విద్యాప్రవీణ,

ముపసూరి మల్లికార్జునరావు, P. O. L.

**1952**



వెల
రూపాయిన్నర

# ఉపోద్ఘాతము



పూవును మీఱి తొడిమ యుండరాదు. ఇంత చిన్నిపాత్రమునకు పెద్ద పీఠిక అందగింపదు. మహాకవి శ్రీ హర్షదేవుఁడు "రత్నావళి" నాటికను సంస్కృతమున రచించినాఁడు. దాని కిది ఆంధ్రానువాదము.

రూపకము ప్రదర్శనయోగ్యమగుటకు వలసిన ముఖ్యాంగములను నాల్గింటిని శ్రీ హర్షుఁడే పేర్కొనియున్నాఁడు. కవి, కథ, నటులు, పరిషత్తు. ఈ అంగము లుదాత్తస్థాయి నున్నపుడే రూపక ప్రయోజనము సిద్ధించును. రత్నావళిలో నివన్నియు సమకూడెననియే శ్రీహర్షుని నిశ్చయము.

ఇందలి యితివృత్త మొక చక్కని ప్రణయగాథ. కల్యాణాంతము. ప్రభుభక్తి పరాయణము. ప్రణయవృత్త మెప్పుడును చిన్నిచిన్ని కలహములతో సంతరిత మైనప్పుడే సామాజికుల కానందదాయక మగుచుండును. అట్టి ఘట్టములందీ కవి సిద్ధహస్తుఁడు. కథావస్తువున కంతకు మూలకంద మనఁదగిన యౌగంధరాయణ పాత్ర మీ నాటికలో నాద్యంతములందు మాత్రమే తెరపై కెక్కును. అట్లొనర్చుటయు నొక్క వైదుష్యమే.

ఇంక కథాకల్పన మత్యద్భుతము. సారికావృత్తాంతము, మర్కటకథా ప్రవేశము, ఇంద్రజాలికసమాచారము మున్నగునవి యిందులకుఁ బ్రత్యక్ష నిదర్శనములు. మఱియు ఈ నాటికలోఁ గల పాత్రలన్నియు స్త్రీ పురుషుల సహజ స్వభావముల నావిష్కరించునవిగ నుండును. ఇంకొక్కమాట.

దీని నాంధ్రీకరించుటలో నిప్పటి దేశ కాల యభిరుచి ననుసరించి కొలఁది మార్పులు గావించితిని. అంతియకాని మూలమునకు వన్నెపెట్టవలెనన్న తలంపు కాదు. శ్లోక బాహుళ్యము ననుసరించి పద్యబాహుళ్య మొనర్చుట నేఁటి నాటకములకు సరిపడదు. కాఁగా, పెక్కు శ్లోకములను వచనరూపముగ తెనిగించితిని. అట్లని నిష్పద్యము చేయలేదు. వర్ణనాబాహుళ్యముగల ఒకటి రెండు శ్లోకములను

వదలివైచితిని. నా యొనర్చిన మార్పు లిట్టివ. ఈ నాటికకు తెనుఁగుతన మాపాదింపవలెనన్న తలంపుతో నా కావించిన యత్న మెంతవఱకు చరితార్థమైనదో సహృదయులు పరిశీలింతురు గాక.

ఈ గ్రంథరచనలో నన్నుఁ బ్రోత్సహించిన రసజ్ఞుల కెంతయుఁ గృతజ్ఞుఁడను.

రాజమండ్రి, }
1—7—52. }

కృతికర్త.
య. మల్లికార్జునరావు.



# ఇందలి పాత్రలు

పురుషులు :

1. సూత్రధారుఁడు.
2. వత్సరాజు—నాయకుఁడు.
3. వసంతకుఁడు—విదూషకుఁడు
4. యౌగంధరాయణుఁడు—అమాత్యుఁడు.
5. వసుభూతి—విక్రమబాహుని అమాత్యుఁడు.
6. బాభ్రవ్యుఁడు—కంచుకి.
7. ఇంద్రజాలికుఁడు.
8. విజయవర్మ.
9. వైతాళికులు.

స్త్రీలు :

1. నటి
2. వాసవదత్త—పట్టమహిషి.
3. సాగరిక—రత్నావళి (నాయిక.)
4. కాంచనమాల
5. సుసంగత
6. మదనిక
7. చూతలతిక
8. నిపుణిక

(4–8) పరిచారికలు.

9. వసుంధర—కంచుకి.

# రత్నావళి - నాటిక.

## ( నాంది )

చంద్రశేఖరు శిరముపైఁ జల్లువేడ్క-
లీలఁ గై కొన్న పుష్పాంజలిని గరంబు
భయవికంపితగాత్రియై పతికిఁ జెంత
నేల విరజిమ్ము గిరిజ మిమ్మేలుఁ గాత.

# రత్నావళి - నాటిక.

సూత్రధారుఁడు :— పెక్కు మాటలతోఁ బనిలేదు. శ్రీహర్ష దేవుని పాదపద్మముల నాశ్రయించి జీవించెడి సామంతరాజు లెల్ల రీ వసంతోత్సవసమయమున గౌరవపురస్సరముగ నన్నాహ్వానించి "మన యొడయఁడు శ్రీహర్షదేవుఁ డత్యపూర్వవస్తు రచనాలంకృతమగు రత్నావళి నాటికను రచించి యుండెనని శ్రోత్రపరంపరగ వింటిమేకాని ప్రదర్శనము మాత్ర మింతదనుకఁ జూడనైతిమి. సకలజన హృదయాహ్లాదకరుఁడగు నా రాజచంద్రుని యందలి గౌరవమునతో లేక మాయందుఁగల అనుగ్రహబుద్ధితో ఆ నాటికను బ్రదర్శింపవలెనని అడిగియున్నారు. కావున నా యా వేషముల ధరించి నాటికను బ్రదర్శించుట ప్రస్తుతకర్తవ్యము. ఆహా! సామాజికుల చిత్తము నాకర్షించితి ననియే నిశ్చయింతును. ఏమన,

కవియు హర్షుండు; సభ గుణగ్రాహిణియును
వత్సచరితంబు హృద్యంబు; వాసిఁగన్న
మేమె నటులము; మద్భాగ్యమేమి చెప్ప
అన్ని సమకూడె; ఫలసిద్ధి యెన్ననేల?

ఇంక త్వరగా నింటికిఁ బోయి యిల్లాలిని బిలిచి సంగీతము నారంభింతును. (తెరవంక చూచి) ఇదే మా యిల్లు. లోనికిఁ బ్రవేశింతును. (వెళ్లి) పూజ్యురాలా! ఇటు రమ్ము.

నటి:— ఆర్యపుత్ర! వచ్చితిని. ఏమి సెలవు?

సూత్ర :—పూజ్యురాలా! సామంతరాజు లెల్లరు రత్నావళీ దర్శన సముత్సుకులై యున్నారు. మనమింక వేషములను ధరింపవలెను.

నటి :—(విచారముతో) ఆర్యపుత్ర! నిర్విచారపురుషులు గదా తమరు. నాటకముల నాడక ఇంకేమి చేయుదురు. నిర్భాగ్యురాలనగు నాకేకదా ఇది కూతురు? దేశాంతరస్థున కీముగ్ధనిచ్చి తమరు పాణిగ్రహణము చేయ సమకట్టితిరి. ఈ దేశాంతర మేమి? ఈ అల్లుఁడేమి? ఈ పాణిగ్రహణ మేమి? అను చింతలో మునిగి తేలుచున్న నేను మీ నాటకములో వేషము ధరింపవలెనా? బాగున్నది వరుస.

సూత్ర :—ఓసి పిచ్చిదానా! అల్లుఁడు దూరదేశస్థుఁడని యీ యీ విచారము. చాలు చాలు; చూడు,

సాగరమునుండి కాని విశాలమైన
ద్వీపములనుండి కాని సుదీర్ఘదిశల
నుండియేకాని కోర్కులనూనగతిని
అభిముఖుండైనచో దేవుఁ డందఁజేయు.

[తెరలో]

బాగు, బాగు. భరతపుత్రుఁడా! బాగు, బాగు. అదియే సత్యము. సందేహమేల? (సాగరమునుండి కాని, అని తిరిగి పాడును)

సూత్ర :—(విని, సంతోషముతో) ఆర్యా! అదుగో, నా కనిష్ఠసోదరుఁడు యౌగంధరాయణ వేషమును ధరించి రానేవచ్చినాఁడు. ఇఁకరమ్ము. మనముకూడ వేషధారణకై త్వరపడుదము. నిష్క్రమింతురు.

ప్రస్తావన.

# ప్రథమాంకము.

యౌగంధరాయణుఁడు :—అది సత్యమే. సందేహ మెందులకు ?

సాగరమునుండి కాని విశాలమైన
ద్వీపముల నుండికాని సుదీర్ఘదిశల
నుండియేకాని కోర్కె లన్యూనగతిని
అభిముఖుండైనచో దేవుఁ డందఁజేయు.

అట్లుకానిచో, బైరాగివాని మాటలను నమ్మి మా యేలిక పాణిగ్రహణముకై సముద్రయానముచేఁ గొనిరాఁబడుచున్న సింహళేశ్వరపుత్రిక నౌకాభంగముచే సముద్రమధ్యమున మునుగుటయు, తెప్పకొయ్య నొకదానిని సాధనముగ గ్రహించి యీ యొడ్డు పట్టుటయు, సింహళమునుండి తిరిగి వచ్చుచున్న కౌశాంబివర్తకుఁ డీమె కుపచారములు సల్పి రత్నమాలనుధరించిన కారణముచే రాజపుత్రియై యుండునని తలంచి యామె నిచ్చటికిఁ దోడ్కొనివచ్చి మా కొప్పగించుటయు నెట్లు జరుగును ? (సంతోషముతో) మా ప్రభువుల కభ్యుదయపరంపర లతిసన్నిహితములై కనవచ్చుచున్నవి. (ఆలోచించి) ఈ బాలికను గౌరవపురస్సరముగ మహారాణి కొప్పగించిన నేను గూడ మంచిపనినే చేసితినని తలంతును. ఇంక మా కంచుకియైన బాభ్రవ్యుఁడు కూడ సింహళామాత్యునితోఁ గలసి సముద్రమునుండి

యెట్లో బయటపడి 'కోసలముపై దండెత్తుటకు వెడలిన రుమణ్వంతుని గలసికొన్నట్లుగ' వినియుంటిని. ప్రభు ప్రయత్న మీ తీరున కొనసాగుచున్నను నాకు మాత్రము ధైర్యము చాలకున్నది. భృత్యభావము కష్టదాయకము కదా! ఏమన, ప్రభువుల యభ్యుదయమునకు హేతుభూతమై భగవంతుని చేయూతయుఁ గలిగిన యీ మహో ద్యమము తప్పక సఫలమగు ననుటలో నావంతయు సంశయము లేకున్నను స్వేచ్ఛాచారినగుటచే నేలికవలన భయపడుచుంటిని.

[తెరలో కలకలము]

రూాగంధ :—(విని) ఓహో! సున్నితమైన మృదంగ వాద్యము ననుసరించి మృదుమధుర సంగీతముతోఁ బురజనుల తాళధ్వను లింపును సొంపును గూర్చుచున్నవి. ఈ మదన మహోత్సవ సందర్భమున, పురజన ప్రమోదము నవలోకించుటకై ప్రాసాదాభిముఖముగ ప్రభువు లేతెంచుచున్నారని తలంతును. ఈ ప్రభువు-

శ్రాంతవిగ్రహుఁ డఖిల సుప్వాంతవాసి
ప్రియవసంతకుఁ డెంతయుఁ బ్రేమమూర్తి;
నిజమహోత్సవ దర్శనోన్నిద్రుఁడగుచు
వచ్చుచున్నాడుఁ స్మరునట్లు వత్సనృపతి.

(పైకిఁజూచి) అరరే, ప్రభువు లప్పుడే ప్రాసాదము నధిష్ఠించి నారు. ఇంక నే నింటికిఁ బోయి కార్యశేషము నాలోచింతును.

(నిష్క్రమించును)

విష్కంభము.

(వసంతోత్సవమున కనుగుణములగు దుస్తులతో రాజు సింహాసన మధిష్ఠించి యుండును. విదూషకుఁడు ప్రక్క నిలబడి యుండును.)

రాజు:—(సంతోషముతో - చూచి) సఖా ! వసంతక!

విదూ:— చిత్తము.

రాజు:—

శత్రులులేరు రాజ్యమున సర్వము భార మమాత్యనిష్ఠ మా
మిత్రులపోల్కి యీప్రజ లమేయముదంబును బొందుచుండి రే
యాత్రము లేదు; ప్రేయసి గుణాఢ్య; వసంతముకాలమిద్ధ నా
మిత్రుఁడవీవు ; మన్మథసమిద్ధమహోత్సవ మస్మదీయమే.

విదూ :—(సంతోషముతో) ఈ యుత్సవము నీదికాదు. మన్మథునిదికాదు. బ్రాహ్మణ బ్రహ్మచారినగు నాది అని తలంచుచున్నాను. కనుకనే నన్నింతగా కొనియాడుచు న్నావు. దీనికేమి కాని, ఇటుచూడుము. మధుమత్తకామినీజనముచే దృఢతరముగ కౌగిలింపఁబడి క్రీడాజలయంత్ర

ప్రహారముల కనుగుణముగ నాట్య మొనర్చుచున్న నాగర కులు, మృదంగ వాద్యము ననుసరించిన తాళధ్వనులచే మాఱుమ్రోగుచున్న రథ్యలు, పటవాసపుంజపింజరీ కృతములగు దిశాముఖములు కలిగి కన్నులపండువై యొప్పు చున్న యీ మదనమహోత్సవ లక్ష్మిని దిలకింపుము.

రాజు :—(సంతోషముతో అన్ని దిక్కులనుజూచి) ఆహా! ఈ పురజనుల సంతోషమునకు మేర లేదు. ఏమన కుంకుమ రాగము వలె నుషఃకాంతుల నీనుచున్న పటవాసద్రవ్య ముల చేతను, సువర్ణమయములగు నాభరణముల కాంతుల చేతను, రక్తాశోకముల కుసుమములచేతను, నీ కౌశాంబీ పట్టణము వితేశకోశవై భవమును ధిక్కరించుచు పసిడికాం తుల విరజిమ్ము ప్రజానీకముతో నిక్కిలి పచ్చనై కన్నుల పండు వొనరించుచున్నది. మఱియు ధారాయంత్రముల నుండి నిరంతరము స్రవించెడి యుదకధారలచే పంకిలమై కుంకుమక్షోద భూయిష్ఠములగు ప్రాంగణసీము విహారించెడి యువతుల కపోలములనుండి రాలిపడిన సిందూరముచే నెఱ్ఱ వడిన చరణ న్యాసములు కారణముగా నీ కుట్టిమ భూము లన్నియు సిందూరమయము లగుచున్నవి.

విదూ :—(చూచి) ప్రభూ! కోడెగాండ్రు గుఱిచూచి విర జిమ్మెడి శృంగకజలప్రహారముల తాకిడికి నోర్వలేక పదే పదే సీత్కార మొనర్చుచున్న వారవిలాసినుల విలాసవై భవమును దిలకింపుము.

రాజు:—మిత్రమా! చక్కగాఁ జూచి చెప్పితివి. ఏమన పట వాస ద్రవ్యముల నదేపనిగ విరజిమ్ముటచే చిమ్మచీకటు లావరించినటులున్న యీ మదనమహోత్సవ క్షేత్రమున నతివలు ధరించిన మణివిభూషణకాంతిప్రసరములచే నప్పు డప్పుడు తళుక్కున మెరయుచు ఫణాకృతిశృంగకముల ధరించియున్న యీ భుజంగలోకము పాతాళమును దల పించుచున్నది.

విదూ:—(చూచి) ఓ ప్రభూ! ఇటు చూడుము. మదన పర వశయైన యీ మదనిక వసంతాభినయమును బ్రదర్శించుచు చూతలతికతోఁగూడి యిటే వచ్చుచున్నది.

(మదనికా చూతలతికలు ద్విపదీఖండము పాడుచు మదనలీలల నటించుచుఁ బ్రవేశింతురు.)

మదనిక:—

చూతముల మొగ్గతొడిగించు నీతిపరుఁడు
మానవతి బింక మిగురించు మానధనుఁడు
పంచబాణుని ప్రియదూత ప్రాణసఖుఁడు
వీచుచున్నాఁడు పవనుండు వేడ్కలలర.

రాజు:—(పాత్రఁజూచి) ఆహా! ఈ యువతుల క్రీడారస మెంతయు మృదుమధురము; శ్లాఘనీయము.

విదూ:—ప్రభూ! నేను గూడ వీరి నాట్యమునఁ బాల్గొని మదనమహోత్సవమును గౌరవించెదను.

రాజు:—(చిఱునవ్వుతో) మిత్రమా! అట్లే చేయుము.

విదూ:—చిత్తము. (మదనికాచూతలతికలతోఁ గలసి నాట్యముచేయుచు) మదనికా! చూతలతికా! నాకుఁ గూడ నీ చర్చరికను నేర్పరాదా?

ఇద్దఱు:— పిచ్చివాఁడా! చర్చరిక కాదిది. ద్విపదీఖండము.

విదూ:— ఈ ఖండముతో మోదకములు తయారుచేయుదురా?

మదనిక:— (నవ్వి) కాదు. కాదు. ఇది పఠింపఁబడునది.

విదూ:— (విషాదముతో) పఠింపఁబడునదా! సరే. అగుచో నా కక్కఱలేదు. ఇంతకంటె మా ప్రియమిత్రుని దగ్గర కేగుటే మంచిది. (పోఁబోవును.)

ఇద్దఱు:—బాపఁడా! ఎక్కడకుఁబోదువు? ఆడుకొందము రమ్ము. (వసంతకుని బలవంతముగ లాగుదురు. వసంతకుఁడు పెనగులాడుచు తుదకు పాఱిపోవును.)

విదూ:—(రాజును సమీపించి) ప్రభూ! నాట్యమొనరించి వచ్చితిని. కాదు. కాదు. ఆడుకొని పాఱిపోయివచ్చితిని.

రాజు:—మంచిపని చేసితివి.

చూత:—ఓసీ! మదనికా! చాలసేపటినుండియు మన మాటలాడుచుంటిమి. ఇంకఁ జాలును. రమ్ము. మహారాణి సందేశమును మహారాజునకు విన్నవింతము.

మదనిక:—అవును. త్వరగాఁబోవుదము.

ఇద్దఱు:—(రాజును సమీపించి) ప్రభువులకు జయము. దేవి

ఆజ్ఞాపించుచున్నది. (నాలుక కఱచికొని) కాదు కాదు. విన్నవించుచున్నది.

రాజు :—(సంతోషముతో నవ్వుచు) ఆజ్ఞాపించు చున్నదనుటయే హృద్యముగనున్నది. విశేషించి యీ మదన మహోత్సవ సమయమున నింకను బాగున్నది. సరే. చెప్పుము. దేవి ఏమని యాజ్ఞాపించినది ?

విదూ :—ఓ దాసీపుత్రి ! దేవి యాజ్ఞాపించుచున్నదా ?

ఇద్దఱు :—దేవ ! మహారాణి యిట్లు విన్నవింపు చున్నది.

"నేఁడు మకరందోద్యానమునకుఁ బోయి రక్తాశోక పాదపతలప్రతిష్ఠితుఁడగు కుసుమాయుధునకుఁ బూజాదికము నిర్వర్తింపవలెను. ఈ సందర్భముగ నార్యపుత్రులును నచ్చటికి దయచేయవలెను" అని.

రాజు :—(ఆనందముతో) మిత్రమా ! ఉత్సవముపై నుత్సవము వచ్చిపడినదోయీ!

విదూ :—ప్రభూ ! త్వరగా బయలుదేరుము. అచ్చటికే పోవుదము. ఈ బ్రాహ్మణునకేమేని స్వస్తివాయనము కూడ లభింపఁగలదు.

రాజు :—మదనికా ! మకరందోద్యానమునకు వచ్చుచున్నామని దేవికి విన్నవింపుము.

మదనిక :—చిత్తము. [ఇద్దఱు నిష్క్రమింతురు.]

రాజు :—మిత్రమా ! ఉద్యానమార్గము నాదేశింపుము.

విదూ :—ఇటు దయచేయుఁడు.

(ఇద్దఱు బయలుదేఱుచున్నారు.)

విదూ :—(ముందుకుఁజూచి) ఇదే మకరందోద్యానము. లోనికిఁ బ్రవేశింతము. (ప్రవేశింతురు.)

విదూ :—(నలువైపులఁ గలియఁజూచి, ఆశ్చర్యముతో) మహారాజా! మలయమారుతముచే నిటునటు కదలుచు మొగ్గతొడిగిన యీ తీయమామిళ్ళ సుమపరాగముచే పటవితానము నేర్పఱిచి, మధుకరఝుంకార మిళితములగు కోకిలాలాప సంగీతములచే హాయినిగొల్పుచు నీ మకరందోద్యానము భవదీయాగమనము నభినందించునది వలెఁ జూపట్టుచున్నది. ఇఁక లోనికిఁ బ్రవేశింపుము.

రాజు :—(నలుదెసలు విలోకించి) ఆహా! ఈ యుద్యాన మెంత శోభాన్వితము! ఇచటి వృక్షములన్నియు పగడములను ధిక్కరించెడి యెఱ్ఱనికిసలయములు కలిగి, హృద్యములగు మధుకర ఝుంకారములచే నస్పష్టవ్యాహారముఁ బొంది, మలయానిల కంప్యమాన శాఖాసమూహములచే గిఱ్ఱునఁ దిరుగుచు మధుప్రసంగ మధువుచే భ్రాంతినిబొంది మత్తిలినవి వలె నగపడుచున్నవి.

విదూ :—(ఆకర్ణించి) ప్రభూ! మహారాణి కాలిచప్పుడువలె వినవచ్చుచున్నది.

రాజు :—మిత్రమా! బాగుగా గుర్తించితివి.

(వేషభూషిత యగు వాసవదత్తయు, పూజోపకరణముల గ్రహించి కాంచనమాలయుఁ బ్రవేశింతురు. సాగరికయుఁ బ్రవేశించును.)

వాసవదత్త :—కాంచనమాలా ! మకరందోద్యానమునకు దారి చూపుము.

కాంచ :—మహారాణీ ! ఇటు దయచేయుఁడు.

వాస :—(పరిక్రమించి) కాంచనమాలా ! మన్మథపూజ జరుగవలసిన రక్తాశోక పాదప మింకెంత దూరమున నున్నది ?

కాంచ :—అమ్మా ! దగ్గరకే వచ్చితిమి. ఇదిగో ఇది నిరంతరోద్భిన్న కుసుమశాలిని, తమరు పెంచుచున్న మాధవీలత. దీనిని దాటినచో నవమాలికాలత. దానిని బుష్పింపఁజేయుటకే ప్రభువు లనుదినము నాయాసపడుచున్నారు. దానిని గూడదాటినచో తమరు పూజాదికము నిర్వర్తింపవలసిన రక్తాశోకపాదపము వచ్చును.

వాస :—సరే. త్వరగాఁబోవుదము.

కాంచ :—ఇటు దయచేయుఁడు. [అందఱు వెళ్లుదురు.]

వాస :—మన్మథపూజ లొనర్పవలసిన రక్తాశోకపాదప మిదియే. పూజాసామగ్రి నిటు కొనిరండు.

సాగరిక :—[సమీపించి] అమ్మా ! అంతయు సిద్ధముగ నున్నది.

వాస :—[తనలో] ఓహో ! ఏమి యీ పరిజనుల నిర్లక్ష్యము? ప్రభువులకు దృగ్గోచరము కాకుండు నట్లింతవఱకును భద్ర

ముగా రక్షింపఁబడుచున్న యీ సాగరిక యిప్పు డతినుల భముగ నతని దృష్టిపథమునఁ బ్రవేశింపఁగలదు. సరే. ఈ విధముగఁ బల్కెదను. [ప్రకాశముగ] సాగరికా! పరిజను లందఱు నుత్సవపరాధీనులై యుండఁగా సారికను విడచి నీ వెందుల కిచ్చటికి వచ్చితివి? శీఘ్రమే బయలు దేరుము. ఈ పూజా సామగ్రిని కాంచనమాల కొప్పఁజెప్పి పొమ్ము.

సాగ:—చిత్తము. [కొంతదూరముపోయి తనలో] గోరువం కను సుసంగత కప్పగించియే వచ్చితిని. అసలీయుత్సవ మును జూడవలెనన్న కుతూహలము నాకు మెండుగనున్నది. మా పుట్టినింటఁ గూడ నిట్టి పూజలు జరుగుచుండును కాని యీ యుత్సవ మట్టిదో లేక మఱెట్టిదో యిటనే రహస్య ముగ దాగియుండి చూచెదనుగాక. ఇచట పూజ ప్రారంభ మగు నంతలో నేను గూడ కామదేవుని బూజించుటకై కొన్ని కుసుమములను గోసికొందును. [పూవులు కోయు చుండును.]

వాస:—కాంచనమాలా! ప్రద్యుమ్న దేవునిఁ బ్రతిష్ఠింపుము.

కాంచ:—చిత్తము. (రక్తాశోకము క్రింద మన్మథ విగ్రహము నెలకొల్పును.)

విదూ:—(పరిక్రమించి, ఓ ప్రభూ! కాలి చప్పు డింక విన వచ్చుట లేదు. మహారాణి అశోకమూలము నీ పాటికిఁ జేరుకొనియే యుండును.

రాజు :—మిత్రమా ! బాగుగా గుర్తించితివి. ఈదేవినిజూడుము. ఈమె కుసుమసుకుమార మగు మూర్తిని దాల్చి, నియమ వశమున సన్నగ కృశించిన మధ్యభాగము గలిగి మకర కేతుని పార్శ్వమందున్న చాపయష్టివలె నతి మనోహార ముగఁ బ్రకాశించుచున్నది. అచటికిఁ బోవుదము. రమ్ము.

రాజు :—(సమీపించి) ప్రియురాలా !

వాస :—(చూచి) ఆర్యపుత్రులా ! ప్రభువులకు జయము. ఈ యాసన మలంకరింపుఁడు.

రాజు :—(కూర్చుండును.)

కాంచ :—అమ్మా ! కుసుమ కుంకుమ చందన వాసస్సుల నొసంగి మదనదేవునిఁ బూజింతురు గాక.

వాస :—ఏదీ ! పూజా సంభారము గొనిరమ్ము.

(కాంచనమాల పూజాసామగ్రి నందిచ్చును. వాసవ దత్త పూజ నారంభించును.)

రాజు :—ప్రియురాలా ! ప్రత్యగ్రమజ్జన విశేషముచే గరగరని మేనికాంతులుగల్గి యెఱ్ఱని యంచుగల వలువను ధరించి మకరకేతను నర్చించుచున్న నీవు కెంజిగుళ్లు గల వృక్షము నుండి ప్రభవించిన సన్నని లతవలె శోభించుచున్నావు. మఱియు మన్మథ పూజావ్యాపృతమగు నీ మృదుహస్తము తగిలినంత మాత్రమున నీ యశోకద్రుమము మృదుతరకిసల యాంతరమును ధరించినదివలెఁ జూపట్టుచున్నది. ఇంకను,

నీ పాణిస్పర్శోత్సవ భాగ్యము నొందఁజాలమి కీయనంగుఁడు తన యనంగత్వము నిప్పుడు తప్పక నిందించుకొనఁ గలఁడు.

కాంచ :—అమ్మా! పూజాదికము పరిసమాప్తమైనది. ఇంక ప్రభువులను సత్కరింపవలెను.

వాస :—అవును. చందనమును, గుసుమములను దీసికొని రమ్ము.

కాంచ :—అన్నియు సిద్ధముగ నున్నవి.

(వాసవదత్త రాజును సత్కరించును.)

సాగరిక :—అయ్యో! కుసుమాపచయము నిమిత్తముగా చాల జాగొనర్చితిని. ఇంక నీ సిందువారవిటపము చాటునఁ జేరి పూజా విధానమును జూచెదనుగాక. (చూచి) ఏమిది? కుసుమాయుధుఁ డిచ్చటికి ప్రత్యక్షముగనే వచ్చినాఁడే. మా పుట్టినింట నిట్లుగాక చిత్రగతుఁ డగు మన్మథుఁడే పూజింపబడుచుండును. నేను గూడ నీ పుష్పములతో నిచట నుండియే ఆ కుసుమాయుధునిఁ బూజించెదను. (పూవులను జల్లును) ఓ భగవంతుఁడా! మన్మథుఁడా! నమస్కారము. శుభదర్శనుఁడ వగుము. చూడఁదగిన దానిని జూచితిని. అమోఘదర్శనుఁడవగుము. [నమస్కరించును.] ఆశ్చర్య మాశ్చర్యము. ఎంత చూచినను తనివి తీఱకున్నది. ఇతరు లెవ్వరు రాకుండునంతలో నిటనుండి బయలు దేరుదును.

కాంచ :—ఆర్య! వసంతకా! నీవు కూడ స్వస్తివాయనము గ్రహింపుము.

విదూ :—[సిద్ధపడును.]

వాస :—[చందన కుసుమ తాంబూలముల నొసంగుచు] ఆర్య ! స్వస్తివాయనము గ్రహింపుము.

విదూ :—[సంతోషముతో గ్రహించి] వాసవదత్తా మహారాజ్ఞికి జై.

[తెరలో వైతాళికుఁడు]

"ఉదయన మహారాజా ! వత్సభూపతీ ! సాయంసమయ మాసన్నమైనది. ప్రభుచంద్రుల చరణసేవకై సామంత రాజలోక మాస్థానమును జేరి నిరీక్షించుచున్నది."

సాగ :—(విని, సంతోషముతో వెనుకకుఁ దిరిగి రాజునుజూచి పేరాపతో) ఎట్టెట్టూ ! ఉదయన మహారాజా యితఁడు ? ఇతనికే కదా పాణిగ్రహణార్థమె నా తండ్రి నన్నొసంగఁ దలంచినది. పరాధీనజీవితము గడుపుటచే నిట్లు క్రుంగి కృశించుచున్నను నీ రాజచంద్రుని దర్శనభాగ్యము కలిగినది కదా యని మిక్కిలి సంతసించుచున్నాను.

రాజు :—ఏమిది ? ఉత్సవాపహృతచిత్తులమై సంధ్యాతిక్రమమును గూడ గణింపనైతిమి. దేవీ ! చూడుము. హృదయస్థితుఁడగు దయితుని, పాండురముఖముచే కామిని సూచించినట్లుగ నుదయతటాంతరితుఁడగు నిశానాథుని నీ ప్రాచీదిశాంగన చక్కగా విశదీకరించుచున్నది. దేవీ ! ఇంక బయలుదేరుదమా ? అంతఃపురమును బ్రవేశింతము.

(అందఱు బయలుదేరుదురు.)

సాగ :— మహారాణి బయలుదేరుచున్నది. సరే. నేనును త్వరగా బోయెదను. (పేరాసతో రాజువంక చూచి, నిట్టూర్పువిడిచి) అయ్యో! ఇంకఁ గొంత తడవు ఈ ప్రభు చంద్రుని దర్శించుటకైన నీ మందభాగిని నోచుకొనలేకు గదా! (నిష్క్రమించును.)

రాజు :—(పరిక్రమించి) దేవి!

అతిశయితచంద్రబింబమై యలరు నీదు
వదనపంకజమున కోడె పద్మవితతి;
వారవనితల గానమ్ము తీరు చూచి
సిగ్గువడి భృంగములు దూరె మొగ్గలందు.

[అందఱు నిష్క్రమింతురు.]



# ద్వితీయాంకము.

[పంజరము పట్టుకొని సుసంగత ప్రవేశించును.]

సుసం:—అయ్యో! సారికను నా కప్పగించి యీ సాగరిక యెచ్చటికిఁ బోయినదో కదా! ఇపు డీపె నెక్కడ చూడఁ గలను? (మఱియొక వైపునకుఁ జూచి) ఏమి? నిపుణిక యిటే వచ్చుచున్నది. ఈమె నడిగి తెలిసికొందును.

(నిపుణిక ప్రవేశించును.)

నిపు:—ఆశ్చర్య మాశ్చర్యము. దేవతల మహిమ అనన్య సదృశముగదా! ప్రభువుల యీ సమాచారమును మహారాణికి విన్నవించెదను. (వెళ్ళును.)

సుసం:—(సమీపించి) నిపుణికా! విస్మయవశమునఁ బరవశవై దగ్గరలోనున్నను నన్నుఁ జూడకయే పోవుచున్నావు.

నిపు:—ఓహో! సుసంగతా! చక్కఁగా కనిపెట్టితివి. నేఁడు శ్రీశైలమునుండి వచ్చిన శ్రీకంఠదాసునొద్ద ప్రభువులకాల కుసుమసంజననదోహదము నేర్చుకొని తన్మాలమునఁ దమ నవమాలికాలతను గుసుమసమృద్ధి కలదానిని గఁజేయనున్నారు. ఈ సమాచారమును దెలిసికొనుటకే మహారాణి నన్నంపి యున్నది. నీ వెచ్చటికి బయలుదేరితివి?

సుసం:—నేనా! ప్రియసఖియగు సాగరికను వెదకుటకై బయలుదేరితిని.

నిపు :—సుసంగతా ! సాగరిక నా కగపడినది. లేఖన పరికర ముల గ్రహించి విచార హృదయముతోఁ గదళీగృహము ప్రవేశించుచుండఁగాఁ జూచితిని. అచ్చటి కేగి యామెను గలసికొమ్ము. నేనింక మహారాణి యొద్దకుఁబోయెదను.

(ఇరువురు నిష్క్రమింతురు.)

(చిత్రఫలకమును వర్తికను గ్రహించి మదనావస్థను నటించుచు సాగరిక ప్రవేశించును.)

సాగ :—హృదయమా ! దయ లేదా ? ఆయాసమాత్ర ఫలక మగు నీ దుర్లభ జనప్రార్థనము నీ కేల ? అదియునుఁగాక యెవనిని జూచినంతనే నీ కింతటి సంతాపము ప్రవృద్ధమగు చున్నదో అట్టివానిదర్శనమే తిరిగి యభిలషించెద వేల ? ఆహా ! ఏమి నీ మూఢత్వము ! (ఆశ్చర్యముతో) ఓ క్రూర హృదయమా ! నాతో సమముగ నేకకాలమందే పుట్టియు నన్నువిడిచి క్షణమాత్ర దర్శనపరిచితుఁడగు నీతని నదేపనిగ ననుసరించుచున్న నీకు సిగ్గు లేదా ? అథవా నీ తప్పే మున్నది లే. పంచశరశరవ్రాతము పైఁబడు నను భీతిచే నిట్లొనర్చి యుందువు. ఆ పంచశరునే నిందింతును. (కన్నీటితో దోసిలినొగ్గి, మోకరించి) భగవన్ ! కుసుమాయుధ ! సకల సురాసురులను జయించిన నీ వొక్క యాడు దానిని బ్రహరించుటకు సిగ్గుపడుట లేదా ? ఇంతకు అనంగుఁడవు కదా నీవు. నిన్నన్న పాప మేమున్నది ? సర్వవిధముల దుర

దృష్టవంతురాలనగు నాకీ దుర్నిమిత్తముచే మరణ మవశ్య సన్నిహితమైయున్నది. ఇతరు లెవ్వరు రాకమునుపే ఆ యభిమతపురుషుని నొక్కసారి చిత్రపటమున వ్రాసికొని, తనివి తీరఁజూచుకొని యసుపరిత్యాగము కావించెదను. (నిశ్చలమనస్స్కతో ఫలకమును గ్రహించి, నిట్టూర్పువిడిచి) సాధ్వస వశమున నాయగ్ర హస్తము మిక్కిలి వణకుచున్నది. అయినను నా మహాపురుషుని జూచుట కుపాయాంతరము లేమింజేసి యెట్టెట్లో చిత్తరువున వ్రాసి చూచుకొందును.

(వ్రాయుచుండఁగా సుసంగత ప్రవేశించును.)

సుసం :—ఇదే కదళీగృహము. లోనికిఁబోయెదను.

(ప్రవేశించి సాగరికను జూచి యాశ్చర్యముతో) ఇదిగో. నా ప్రియసఖి సాగరిక. అనురాగోత్కృష్ట హృదయయై యేదియో లిఖించుచు నా రాకను సైతము గుర్తింపకున్నది. కానిమ్ము. ఈమె కంటఁబడకయే యీ లేఖనమును బరికించి చూచెదను. (వెనుకగా నిలఁబడి చూచి, సంతోషముతో) ఏమీ! ఇది ప్రభువులనే వ్రాయుచున్నదిగా! బాగు బాగు సాగరికా! బాగు బాగు. రాజహంసి కమలాకరమును వీడి ఇంకెచ్చట రమించును?

సాగ :—(కన్నీటితో) వ్రాయుట పూర్తియైనది. కాని నిరంతర నిపతద్బాష్పధారలచే, తనివితీర నితనినిఁ జూడలేకున్నాను. [ముఖము పైకెత్తి కన్నీటిని దుడిచికొనుచు, సుసంగతను

జూచి పైటచెరగుతో ఫలకమును గప్పిపుచ్చి చిఱునగవు నభినయించుచు] ఓహో! సుసంగతవా! (లేచి సుసంగత చేతులు పట్టుకొని) సఖీ! ఇటు కూర్చుండుము.

సుసం:—(కూర్చుండి హఠాత్తుగా ఫలకము లాగికొని) సఖీ! ఈ చిత్రఫలకమునం దెవరిని వ్రాయుచుంటివి?

సాగ:—మదనమహోత్సవముగదా అని మన్మథుని వ్రాయుచున్నాను.

సుసం:—(చిఱునగవుతో) ఓహో! ఎంత తెలివికలదానవు! అయితే ఒక్కమాట. ఈ చిత్రమొద్దియో వెలితిగ నగపడుచున్నది. నే నిద్దానిని రతిసనాథముగ నొనర్చి యా లోపమును బూరించెదను. (లేఖన పరికరములఁ దీసికొని రతి వ్యపదేశముగా సాగరికనే లిఖించును.)

సాగ:—(చూచి, కోపముతో) సఖీ! ఇచట నన్నెందుకు వ్రాసితివి?

సుసం:—(నవ్వి) సఖీ! నిష్కారణముగ కోపగించెద వేల? నీ వెట్టి మన్మథుని వ్రాసితివో నేనును నట్టి రతినే వ్రాసియుంటిని. ఈ మాటలకేమిగాని అసలు సంగతిని జెప్పుము.

సాగ:—(సిగ్గుతో తనలో) ఈమె నా విషయము నంతను గ్రహించి యుండును. (సుసంగతచేయిపట్టుకొని ప్రకాశముగ) ప్రియసఖీ! చెప్పుటకుఁ జాల సిగ్గుపడుచుంటిని. ఈ సమాచారము నితరు లెఱుఁగకుండునట్లు చేయఁగోరెద.

సుసం :—సిగ్గెందులకు ? ఏతాదృశ కన్యకారత్న మవశ్య మేతాదృశవరునే ప్రేమించితీరును. ఇతరు లెఱుంగకుండునట్లు నేను జూచుకొందునులే. అరచే. మేధావిని సారిక యిచటనే యున్నదే. ఎప్పుడైన నీ సంభాషణ నేరి కడనైన నేకరువు పెట్టునేమో ?

సాగ :—(విచారముతో) సఖీ ! నా యీ సంతాప మంతకంత కధికమగుచున్నది. (మదన బాధను నటించును.)

సుసం :—(సాగరిక హృదయముపై చేయినిడి) సఖీ ! ఓర్చుకొనుము. నే నీ దిగుడుబావి కడకేగి నళినీపత్రములను మృణాళవలయములను గొని తెచ్చెదను. (నిష్క్రమించి తిరిగి ప్రవేశించి తామరాకులతో శయ్యను గల్పించి మృణాలములతో వలయములను రచించి మఱికొన్ని తామరాకులను హృదయముపైఁ బడవేయును.)

సాగ :—సఖీ ! ఈ తామరాకులను తామరకాడలను దీసి పారవేయుము. ఈ వైద్యము చాలును. నిష్కారణముగ నీ వాయాసపడుచున్నావు.

అతఁడు దుర్లభుఁ డతనిపై నాశ మెందు
లజ్జ ప్రబలంబు ; పరవశురాలనైతి
విషమ మీ ప్రేమ ; ప్రియసఖి ! వినుమొకందు
మరణ మొక్కటియే నాకు శరణమిచట.

(మూర్ఛపోవును.)

సుసం :—(జాలిగా) సఖీ ! సాగరికా ! ఊరడిల్లుమూరడిల్లుము.

[తెరలో కలకలము.]

"సువర్ణ శృంఖలములను ద్రెంచుకొని కాలిగజ్జెలు ఘల్లు ఘల్లున మ్రోగునట్లుగ ద్వారములన్నియు దాటు కొనుచు నబలలను భయపెట్టుచు నశ్వపాలకులచే తరుము కొని రాఁబడుచున్న యీ దుష్టవానరము సరాసరి అంతః పురమునే ప్రవేశించుచున్నది."

సుసం:—(ఆకర్ణించి, ముందుకుఁజూచి, కంగారుతో లేచి, సాగరికచేయిపట్టుకొని) సఖీ! లెమ్ము. లెమ్ము. ఈ పాడు కోతి యిటే వచ్చుచున్నది.

సాగ:—(భయముతో) ఇప్పుడేమి చేయుదము?

సుసం:—చేయుట కేమున్నది. ఇటురమ్ము. ఈ తమాలవిటపము మాఱుగున దాగియుందము.

(ఇరువురు దాగియుందురు.)

సాగ:—సుసంగతా! చిత్రఫలకము విడిచి వచ్చితివి కదా! ఎవరైనను దానిని జూతురేమో?

సుసం:—ఓ పిచ్చిదానా! ఇపుడింకను చిత్రఫలకమెందులకు? ఈ దుష్టవానర మిచటి పంజరము తలుపు తెరచినది. పంజరములోని సారిక యెచటికో యెగిరిపోయినది. త్వరగాఁ బోవుదము రమ్ము. ఈపాటికి మన సంభాషణము నేరి కడనైన నేకరువు పెట్టఁగలదు.

సాగ:—సరే. అట్లే పోవుదము. (పరిక్రమింతురు.)

[తెరలో]

"ఆశ్చర్య మాశ్చర్యము."

సాగ :—(విని) సుసంగతా! ఆ పాడుకోతి మరల నిటువచ్చుచున్నదా?

సుసం :—(చూచి, నవ్వుచు) పిరికిదానా! భీతిల్లకుము. ప్రభువుల ప్రోలనుండెడి ఆర్యవసంతకుఁ డిటు వచ్చుచున్నాడు.

(వసంతకుఁడు ప్రవేశించును.)

వసం :—హి. హి. హి. ఆశ్చర్య మాశ్చర్యము. భేష్. శ్రీకంఠదాసా! భేష్.

సాగ :—(ఉబలాటముతో) సఖీ! సుసంగతా! దర్శనీయ పురుషుఁడు సుమా ఇతఁడు.

సుసం :—ఓ అమాయికురాలా! ఇతనిని జూచుటెందులకు? సారిక చాలదూరము పోయినది. దాని ననుసరించుదము రము. (నిష్క్రమింతురు.)

వసం :—భేష్. శ్రీకంఠదాసా! భేష్! దోహదము వాడినంత మాత్రముననే ప్రభువుల నవమాలిక నిరంతరోద్భిన్న కుసుమగుచ్ఛాచ్ఛాదితవిటపయై దేవి పరిగృహీతమగు మాధవీలతను బరిహసించునట్లుగ తయారైనది. ఈ సమాచారము నా ప్రియవయస్యునకు నివేదించెదను. (పరిక్రమించి చూచి) ఇదుగో. నా ప్రియమిత్రుఁడు. దోహదమందలి దృఢతర ప్రత్యయముచే నవమాలికను గుసుమ సమృద్ధి

శాలినిగా కలలు గనుచు హర్ష సముత్ఫుల్ల లోచనుఁడై యిటే వచ్చుచున్నాఁడు. ఇతనిని సమీపింతును. (సమీపించును.)

(రాజు ప్రవేశించును.)

రాజు :—(సంతోషముతో) ఉద్దామోత్కలికయు, విపాండుర రుచియు, ప్రారబ్ధజృంభయు, స్వీయశ్వసనోద్గమములచే నాయాస సంధాత్రియు నగు నీ యుద్యానలతను మదనాతురయగు వనితా రత్నమును గాంచినట్లు చూచుచు దేవి కిప్పుడు కోపము తెప్పించఁగలను.

వసం :—(హఠాత్తుగావచ్చి) ప్రభువులకు జయము. ప్రభూ! అదృష్టవంతుఁడవు. దోహదము వాడినంతమాత్రముననే నవమాలిక నిరంతరోద్భిన్న కుసుమగుచ్ఛాచ్ఛాదిత విటపయై దేవీపరిగృహీతమగు మాధవీలతను బరిహసించునట్లు తయారైనది.

రాజు :—మిత్రమా! సందేహమేమి? మణిమంత్రౌషధముల ప్రభావ మంచిత్యము కదా! చూడుము.

కౌస్తుభము గాంచినంతనే కదనసీమ
నిహతమై యొప్పెరాక్షస నివహమెల్ల;
మంత్రములచేత నాగముల్ మహికి వెఱచు
జీవముల నిల్పుఁగాదె సంజీవిలతలు.

మనమీ నవమాలికను దర్శించి చక్షుఃఫల మనుభవింతము. (ఇరువురు పరిక్రమింతురు)

వసం :—(భయపడుచు, ప్రభుహస్తము గట్టిగాఁ బట్టుకొని కంగారుతో) ప్రభూ ! ముందుకు పోవలదు. వెనుకకుఁ బారి పోదము రమ్ము.

రాజు :—ఎందులకు ?

వసం :—ప్రభూ ! ఈ వకుళవృక్షము మీఁద పెద్దభూతము నివసించుచున్నది.

రాజు :—ఛీ. పిచ్చివాఁడా ! నిర్భయముగా నా వెంట రమ్ము. ఇచ్చట భూతము లెట్లుండును ?

వసం :—ప్రభూ ! అక్షరములు కూడ వినవచ్చుచున్నవి. నా మాటలు నమ్మవేని నీవే ముందుకుఁబోయి యాలకింపుము.

రాజు :—(ముందుకేగి ఆకర్ణించి)

> అక్షరమ్ములు స్పష్టమ్ము లతివ వగుట
> మధుర తరములు యువతీ సమాదృతములు
> అల్పకాయమ్ము కలదౌట నపరుషములు
> గోరువంకయె ఇది సఖా ! గొంతుఁజూడ.

(నిపుణముగ పైకిఁజూచి) అవును. ఇది నిజముగా సారికయే.

వసం :—(చిన్నఁబోయి) ప్రభూ! నిజముగా సారికయేనా ?

రాజు :—(చిఱునగవుతో) అవును మిత్రమా !

వసం :—ప్రభూ ! తమరు కేవలము వట్టి పిరికివారు. సారికను జూచి భూతమనుకొని కంగారు పడినారు.

రాజు :—దుర్విదగ్ధుఁడా! నీ చేసిన పని నా పైఁబెట్టు చుంటివా?

వసం :—ప్రభూ! నన్నిపుడు వారింపకుఁడు. (కోపముతో కొంకికఱ్ఱను పైకెత్తి) ఓ దాసీపుత్రి! సారికా! నేను భయపడినట్లు నీవు కూడ తలంచితివా? ఉండుండుము. పిశునజనహృదయ మట్లు కుటిలముగ మెలికలు తిరిగియున్న యీ కొంకికఱ్ఱతో వెలగపండు రాలగొట్టినట్లుగ నొక్క క్షణములో నీ వకుళపాదపము నుండి నిన్ను క్రిందకుఁ బడఁ గొట్టెదను.

రాజు :—(వారించుచు) ఛీ. మూర్ఖుఁడా! గోరువంక యేదో మనోహరముగ మాటాడుచున్నది. దీనిని భయపెట్టకుము. సావధానముగ నాకర్ణింతము.

(ఇరువురు నాకర్ణింతురు.)

వసం :—తెలిసినదా! గోరువంక యేమి పల్కుచున్నదో. ఈ బ్రాహ్మణునకు కడుపునిండ భోజనము పెట్టింపుమని పలుకుచున్నది.

రాజు :—ఊదరపోట్టవాని కెప్పుడును భోజన వ్యాపారమే. దీనికేమి కాని, మిత్రమా! గోరువంక యేమి పల్కినదో నిజముగాఁ జెప్పుము.

వసం :—(విని) ప్రభూ! గోరువంక ఇట్లనుచున్నది.

"ఎవరిని నీవు వ్రాయుచుంటివి?"

"మన్మథోత్సవము గదా అని మన్మథుని వ్రాయుచున్నాను."

"నన్నందు కిచట వ్రాసితివి ?"

"సఖి ! నిష్కారణముగ కోపగించెద వేల ? నీవెట్టి మన్మథుని వ్రాసితివో నేనును నట్టి రతినే వ్రాసితిని. సఖి ! దీని కేమి గాని అసలుసంగతి చెప్పుము." అని. ప్రభూ ! దీని యర్థ మేమైయుండును ?

రాజు :—మిత్రమా ! ఒకానొక కామిని, హృదయవల్లభుని లిఖించి సఖిసముఖమున మన్మథుఁడని చెప్పియుండును. ఆ సఖియు నీ రహస్యమును గుర్తించి 'రతి' అను మిషతో నతని ప్రక్కనే యీ కామినిని లిఖించి యుండును.

వసం :—(చిటికవైచి) ప్రభూ ! ఇప్పుడు బాగుగ నర్థమైనది.

రాజు :—మిత్రమా ! గట్టిగా మాటలాడకుము. గోర్వంక యింకేమో పల్కుచున్నది. శ్రద్ధగా నాలకింతము. (ఇరువురు నాకర్ణింతురు.)

వసం :—ప్రభూ :—తిరిగి యిట్లు పలుకుచున్నది.

"సఖి ! సిగ్గు పడకుము. ఇట్టి కన్యకారత్న మిట్టివానినే తప్పక కోరును." అని. మహారాజా ! ఇంతమాత్రమున నీ వొక్కఁడవే పండితుఁడ వైతివని తలంపకుము. ఈ గోర్వంక పలుకుల కిప్పుడు నేనే వ్యాఖ్యానము చేసెదను. ఇది సరే కాని ఆ చిత్రపటమందలి కన్యక కడుంగడు సౌందర్యవతి యైయుండనోపు.

రాజు :—సావధానముగ వినదము. మన కౌతూహలమున కవకాశము కూడ కలదు.

[ఇరువురు వినుచుందురు.]

వసం :—ప్రభూ! వింటివా గోరువంక పలుకులను.

"సఖి! అంతకంతకు నా సంతాప మధికమగు చున్నది. ఈ నళినీ పత్రములను మృణాళములను దీసి పారవేయుము. నిష్కారణముగ నీ వాయాసపడు టెందులకు?" అని పలుకు చున్నది.

రాజు :—మిత్రమా! వినుటయే కాదు. అభిప్రాయమును గూడ గుర్తించితిని.

వసం :—ప్రభూ! ఇంకను గోరువంక యేమేమో కురకుర లాడుచునే యున్నది. పూర్తిగా వినినపిమ్మట నేను వ్యాఖ్యానించి చెప్పెదను.

రాజు :—చక్కగాఁ బల్కితివి. (ఇరువురు మరల వినుచుందురు.)

వసం :—ప్రభూ! ఈ సారిక చతుర్వేదియగు బ్రాహ్మణుని వలె నేవో మంత్రములను గూడ చదువుచున్న దే!

రాజు :—మిత్రమా! పరధ్యానముగ నుండుటచే తిన్నగా విన లేదు. ఏమని చదువుచున్నది?

వసం :—ఇట్లు చదువుచున్నది.

"అతఁడు దుర్లభుఁ డతనిపై నాశమెందు
లజ్జ ప్రబలంబు పరవశురాలనైతి;

విషమ మీప్రేమ ; ప్రియసఖి ! వినుమొకండు
మరణ మొక్కటియే నాకు శరణ మిచట."

అని.

రాజు :—(చిఱునగవుతో) బ్రాహ్మణోత్తముఁడ వగు నీవు తక్క యింకెవ్వరిట్టి మంత్రార్థములను గుర్తింపఁగలరు ?

వసం :—ప్రభూ ! ఇదంతయు నేమై యుండును.

రాజు :—మిత్రమా ! ఇదంతయు నొక పెద్దగాథ.

వసం :—ఏమీ ! ఇది గాథయా ! అనఁగా నాకేమి బోధపడినది?

రాజు :—మిత్రమా! ఒకానొక వనితామణి తన ప్రియతమునిఁ బొందలేక జీవితమందాశను వీడి పై విధముగఁ బల్కి యుండును.

వసం : —(బిగ్గరగా నవ్వుచు) ప్రభూ ! ఈ వంకరమాట లెందులకు ? తిన్నగనే చెప్పరాదా ? "నన్నే పొందలేక" అని. కానిచో మన్మథ వ్యపదేశముతో నీవుతక్క మఱెవ్వరు కల్పింపఁబడుదురయ్యా ! (చప్పట్లు గొట్టుచు సంతోషముతో బిగ్గరగా నవ్వును.)

రాజు :—(పైకిఁజూచి) ఛీ. మూర్ఖుఁడా ! బిగ్గరగా నవ్వి గోరువంకను లేవఁగొట్టితివి. ఇపుడది మెచ్చటికో మెగిరిపోయినది.

వసం :—(చూచి) ప్రభూ ! అన్యథాతలంపకుము. ఇది కదళీగృహమునకే పోయియున్నది. మనమును నచ్చటికే పోవుదము.

(పరిక్రమింతురు.)

రాజు :—

తన్వియొక్క తె మదనసంతప్త యగుచు
చెలులతోఁ జెప్పికొన్నట్టి పలుకు లిపుడు
సారికోక్తములై మవ శ్రవణములకు
ధన్యతను గూర్చె. నీ కథా తత్త్వ మిదియ.

వసం :—ప్రభూ ! ఇదే కదళీగృహము. లోనికిఁ బ్రవేశింతము. (ప్రవేశింతురు.) ప్రభూ ! ఈ పాడు సారిక నింక వెదకుట చాలును. చల్లని యీ యరఁటితోఁటలోని పాలరాతిన్నెపై క్షణకాలము విశ్రమింతము.

రాజు :—అట్లే విశ్రమింతము. (ఇరువురు కూర్చుందురు.)

రాజు :—(నిట్టూర్పువిడిచి), "తన్వియొక్క తె మదన సంతప్త యగుచు" అను పద్యమును దిరిగి పాడును.)

వసం :—(ప్రక్కకుఁజూచి) ప్రభూ ! ఈ పంజర మీ సారికదే యైయుండును. ఆ దుష్టవానరము దీని తలుపు తెరచి యుండవచ్చును.

రాజు :—మిత్రమా ! తిన్నగాఁజూడుము.

వసం :—చిత్రము. (పరిశ్రమించిచూచి) ప్రభూ ! చిత్రఫలకము కూడ యిచ్చట దొరకినది. దీనిని దీసికొందును. (తీసికొని చూచి హర్షము నటించును.)

రాజు :—(కౌతుకముతో) మిత్రమా ! ఏమిది ?

వసం :—ప్రభువు లదృష్టవంతులు. నేను జెప్పినట్లు తమరే యిందు లిఖింపఁబడి యున్నారు. నే నప్పుడు చెప్పలేదా

"మన్మథ వ్యపదేశముతో నీవు దక్క మఱెవ్వరు కప్పి పుచ్చఁబడుదు రయ్యా!" అని.

రాజు:—(సంతోషముతో చేతులు జాపుచు) మిత్రమా! ఏదీ చూపింపుము.

వసం:—అమ్మో నేను చూపను. ఆ కన్యక కూడ నీ ప్రక్కనే లిఖింపఁబడి యున్నది. పారితోషిక మేమియు లేకుండగనే యిట్టి కన్యకారత్నమును నీకుఁ జూపుటెట్లు?

రాజు:—(బలవంతముగ పైఁబడి లాగికొని చూచి ఆశ్చర్యముతో) మిత్రమా! చూడు చూడుము. ఈ చిత్రగత యగు కన్యక యెవరై యుండునో? లీలావధూతములగు పద్మములు కలిగి యత్యధికమగు పక్షపాతమును ప్రదర్శించుచు రాజహంసివలె మానసమును ప్రవేశించుచున్నది. మఱియు చతుర్ముఖుఁడీపె ముఖమును బూర్ణేందుబింబమట్లు సృజించి తన్మూలమునఁ గల్గిన నిజాసనాంభోజవినిమీలనముచే మిక్కిలి విచారించుచున్నాఁడు.

(సాగరికా సుసంగతలు ప్రవేశింతురు.)

సాగ:—సుసంగతా! గోరువంక మనకుఁ జిక్కనే లేదు కదా! పోనీ! ఆ చిత్రపటమునైనను గదళీగృహమునుండి తీసికొని పోవుదము.

సుసం:—సఖీ! అట్లే చేయుదము.

వసం:—ప్రభూ! ఈమె అవనతముఖియై లిఖింపఁ బడినదేల?

సుసం :—(విని) సఖీ ! వసంతకుని మాట యట్లున్నది. మహా రాజు కూడ నిచ్చటనే యుండియుండును.

రాజు :—మిత్రమా ! చతుర్ముఖుఁడీపె ముఖమును బూర్ణేందు బింబమట్లు సృజించి నిజాసనాంభోజవినిమీలనముచే నిక్కిలి విచారించుచున్నాఁడు.

సుసం :—సాగరికా ! అదృష్టవంతురాలవు. నీ హృదయవల్లభుఁడు నిన్నెట్లు వర్ణించుచున్నాఁడో వినుచుంటివా ?

సాగ :—(సిగ్గుతో) సఖీ ! ఎందు కీ పరిహాసము ? చులకనై పోయిన నన్నింకను జుల్కన చేయుచున్నావు.

వసం :—(రాజును చేతితోఁగదల్చి బిగ్గరగా) ప్రభూ ! ఈమె అవనతముఖియై లిఖింపఁబడినదేల? అని అడుగుచున్నాను.

రాజు :—మిత్రమా ! సర్వమును సారికయే చెప్పివైచినది.

సుసం :—(నవ్వి) సఖీ ! సారిక అనుకొన్నంత పని చేసినది.

వసం :—ఈమె నీ కంటికింపుగ నున్నదా ?

సాగ :—(భయముతోఁ దనలో) ఎట్టి సమాధానమువచ్చునో? నిజముగ నిప్పుడు మరణజీవితముల మధ్యనుంటిని.

రాజు :—ఇంపుగ నున్నదని వేఱుగఁ జెప్పవలెనా ?

సాగ :—(తనలో) అమ్మయ్యా ! డెందమా ! ప్రసన్నవగుము. నీ కోరికై నను నింతవఱకు సిద్ధించినది.

సుసం :—సాగరికా ! వింటివా ?

సాగ :—(నవ్వుచు) నీవే వినుము. నీ యాలేఖ్యకౌశలమే యిట్లు శ్లాఘింపఁ బడుచున్నది.

వసం :—(ఫలకముచూచి) ప్రభూ! ఈమెకు ప్రక్కనేయున్న తమ చిత్రమును జూచుకొనరేమి?

రాజు :—మిత్రమా! ఈమెచే వ్రాయఁబడితినిగదా యని నిజముగా గర్వించుచున్నాను.

వసం :—ప్రభూ! సరసకమలినీదళమృణాళవిరచితమై మదనావస్థా సూచకమైయున్న యిది యీపె విరహశయ్యయై యుండనోపు.

రాజు :—(క్రింద పడియున్న మృణాళహారమును గ్రహించి హృదయముపైఁ బెట్టుకొని) ఓ జడప్రకృతీ!

చానకుచకుంభముల నుండి జారిపడిన
ఓ మృణాళమ! శుష్కత్వ మొందఁబోకు
తావకీనమ్ము తా సూక్ష్మతంతులకును
చోటు లేదన్న నీ కెట్లు చోటు గలుగు?

సుసం :—[తనలో] అయ్యయ్యో! అనురాగాక్షిప్తహృదయులైన ప్రభువు లసంబద్ధములను గూడ పల్కఁదొడంగినారే! ఇంక నూరకుండుట తగదు. [ప్రకాశముగ] సాగరికా! నీ వెవరికోస మిచ్చటికి వచ్చితివో వారు రరుగో.

సాగ :—[అసూయతో] సఖీ! ఎవరికోస మిచ్చటికి వచ్చితిని?

సుసం :—[నవ్వి] పిచ్చిదానా! ప్రభువులుగల చిత్రఫలకము కోసమై రాలేదా?

సాగ :—[రోషముతో] ఇట్టి జాణతనపు మాటలకు గట్టిదా

నవుగదా ! నేను పోయెదను. [వెళ్ళఁబోవును.]

సుసం :—సఖీ ! కోపింపకుము. ఈణకాల మాగుము. కదళీ గృహమునకుఁబోయి చిత్రఫలకము తీసికొని నేను గూడ వచ్చెదను. కలసియేపోవుదము.

సాగ :—సరే. అట్లే చేయుము. [సుసంగత కదళీగృహము నకుఁ బోవును.]

విదూ :—[సుసంగతను జూచి కంగారుతో] ప్రభూ! ఈ యనఁటి యాకుల్తోఁ జిత్రఫలకమును గప్పివుచ్చుము. దేవీపరిచారిక సుసంగత యిటే వచ్చుచున్నది.

[రాజు ఫలకమును దాచియుంచును.]

సుసం :—[సమీపించి] ప్రభువులకు జయము.

రాజు :—సుసంగతా ! స్వాగతము. ఇటు కూర్చుండుము.

[సుసంగత కూర్చుండును.]

రాజు :—సుసంగతా ! నే నిక్కడ నున్నట్లు నీకెట్లు తెలిసినది?

సుసం :—[పకపకనవ్వి] మీ రున్నట్లు మాత్రమేకాదు. చిత్ర ఫలకముతో సహా యావద్వృత్తాంతము తెలిసినది. సరే. ఇంకఁ బోయి దేవికి విన్నవించెదను. [వెళ్ళఁబోవును.]

వసం :—(ప్రక్కకుఁ దిరిగి భయముతో) ప్రభూ ! అను కొన్నంత పని జరిగితీరును. ఈ గర్భదాసి నోటిలో నూవు గింజ దాగదు. దీని కేదేని పారితోషికము పారవేయుము.

రాజు :—అవును బాగుగఁ జెప్పితివి. (సుసంగత చేయిపట్టు

కొని) సుసంగతా ! ఇదంతయు వినోదము సుమా ! నిష్కా-రణముగ నీవు దేవికిఁ గలతతెచ్చి పెట్టకుము. ఇదిగో. ఈ పారితోషికము గ్రహింపుము.

(కర్ణాభరణము తీసియిచ్చును.)

సుసం :—(తనలో) ప్రభువులు ప్రసన్నులైనారు. (ప్రకాశముగ) ప్రభువుల యీపాటి యనుగ్రహమే పదివేలు. పారితోషికము వలదు. "ఈ చిత్రఫలకమున నన్నెందుకు వ్రాసితి"వని నా ప్రియసఖి సాగరిక నాపై కోపగించియున్నది. ఆమెను బ్రసన్నురాలనుగఁ జేయఁగోరెద.

రాజు :—(సంభ్రమముతో లేచి) సుసంగతా ! ఆమె యిపుడెచ్చట నున్నది ? చూపింపుము.

సుసం :—దయచేయుఁడు. కదళీగుల్మాంతరితశరీరయై యిచటనే యున్నది.

రాజు :—మార్గము చూపుము.

సుసం :—ఇటు దయచేయుఁడు.

వసం :—నే నీ చిత్రఫలకమును దీసికొనివత్తును. ఎప్పుడైనను దీని యవసరము కూడ రావచ్చును.

(అందఱు కదళీగృహమునుండి బయలుదేరుదురు.)

సాగ :—(రాజును జూచి హర్ష సంభ్రమములతో) ఆహా ! ఇతనిని జూచిన పిమ్మట నొక్క యడుగైనను ముందుకు వేయలేకున్నాను. ఇప్పుడేమి చేయుదును ?

వసం :—(సాగరికను జూచి) హీ. హీ. హీ. ఆశ్చర్య మాశ్చర్యము. ఇటువంటి కన్యాకారత్నము మానవలోకమున దుర్లభము. చతుర్ముఖుఁడైనను నీమెను సృజించి విస్మయ పడియుండును.

రాజు :—మిత్రమా ! నేను నట్లే తలంచుచుంటిని.

సాగ :—(అసూయతో సుసంగతను జూచి) సఖీ ! ఈ చిత్ర ఫలకమునా నీవు గొనితెచ్చితివి.

(అని తొందరగా వెళ్ళఁబోవును.)

రాజు

క్రోధవీక్షణ మొనరింపఁ గోర్కెకాని
సహజ సౌమ్యత నెడఁబాయఁ జాలవీవు;
త్వరితగమన మదేలకో తన్వి । గురుని
తంబ మొక్కింత ఖేదమ్ము దాల్చునేమొ ।

సుసం :- మహారాజా ! మా సాగరిక కేవలము ముక్కోపి. తమ రీమె చేయిపట్టుకొని ప్రసన్నురాలనుగఁ జేయుదురు గాక.

రాజు :—(ఆనందముతో) అట్లే చేయుదును.

(సాగరిక హస్తముగ్రహించి స్పర్శసుఖము ననుభవించును.)

వసం :—ప్రభూ ! సాక్షాత్తు అపరలక్ష్మిని తమ రిప్పుడందియున్నారు.

రాజు :—మిత్రమా ! సత్యము. ముమ్మాటికి సత్యము.

ఈమె సాక్షాత్తు లక్ష్మియే ; యీపె కరము
పారిజాతోద్భ వంబైన పల్లవంబె :
కానిచో నేల యీ తన్వికరమునుండి
స్వేద మిష నమృతంబు స్రవించఁగలదు ?

సుసం:—సఖి! ఎంత రాతిగుండెవోయీ! నీవు. ప్రభువులు చేతులు పట్టుకొని అనునయించుచున్నను గోపము విడువకున్నావు.

సాగ :—(భ్రూభంగముతో) నీకు వున్నముందును గాని గట్టిగా మాట్లాడకుము.

రాజు :—ప్రియా ! సాగరికా ! చెలికత్తెలయెడ నింత కోపాను బంధము తగదుసుమా !

వసం :—అమ్మా ! అన్నాతురుఁడగు బ్రాహ్మణునివలె నింత కోపించెద వేల ?

సుసం :—సఖి ! నీతో నే నింక మాట్లాడను.

రాజు :—ప్రియా ! సమాన ప్రతిపత్తిగల చెలిమికత్తెలయెడ నీ విట్లుండుట తగదు.

వసం :—ఈమె రెండో వాసవదత్తయే సుమా !

(రాజు కంగారుతో సాగరిక హస్తము విడిచిపెట్టును.)

సాగ :—(భయపడుచు) సుసంగతా ! ఇప్పుడేమి చేయుదము.

సుసం :—సఖి ! ఈ తమాలవృక్షముల మాటునఁ గొంతసేపు దాగియుందము. (ఇరువురు పోవుదురు.)

రాజు :—(ప్రకటముగఁజూచి ఆశ్చర్యముతో) మిత్రమా ! వాసవదత్తా దేవి ఏది ? ఎక్కడనున్నది ?

వసం :—ప్రభూ! వాసవదత్త రాలేదు. దీర్ఘకోపముగల యీమె వాసవదత్తవలె నున్నదని మాట వరుసకుఁ బల్కినాను.

రాజు :—ఛీ. మూర్ఖుఁడా! ప్రకటరాగము కల్గిన రత్నావళి నెట్లో దైవవశమునఁ బొంది కంఠసీమను ధరింపకయే నీ మూలమున నా చేతులార పోఁగొట్టుకొంటిని.

(వాసవదత్తా కాంచనమాలలు ప్రవేశింతురు.)

వాస :—కాంచనమాల! ప్రభువులు పరిగ్రహించిన నవమాలిక యికెంత దూరమున నున్నది?

కాంచ :—అమ్మా! ఈ కదళీగృహము దాటినంతనే యది కనఁబడును.

వాస :—అచటికి మార్గమా దేశింపుము.

కాంచ :—ఇటు దయచేయుఁడు.

రాజు :—మిత్రమా! ప్రియురాలిప్పుడెచ్చట నుండియుండును?

కాంచ :—అమ్మా! ప్రభువుల మాటవలె వినవచ్చుచున్నది. మీ యాగమనమునే నిరీక్షించుచుండ నోపు. తమరు సమీపింతురు గాక.

వాస :—(సమీపించి) మహారాజునకు జయము.

వసం :—మహారాణి వచ్చినది.

రాజు :—(ప్రక్కకుఁదిరిగి) మిత్రమా! చిత్రఫలకమును దాచియుంచుము.

(విదూషకుఁడు చిత్రఫలకమును గక్షమున ధరించును.)

రాజు :—మహారాణికి స్వాగతము. దేవీ! ఇటు కూర్చుండుము.

వాస :—(కూర్చుండి) ఆర్యపుత్రా! నవమాలిక నిజముగ పుష్పించినదా ?

రాజు :—(తెల్లఁబోవుచు) దేవీ! మే మిచటికివచ్చి చాల సేపైనను నీవింకను రానయితివని నవమాలిక నింతదనుక చూడనే లేదు. మనమందఱము కలిసియే పోయి చూతము గాక.

వాస :—(రాజును తేరిపారిచూచి) నవమాలిక పుష్పించి యున్నదని ప్రభువుల ముఖమే చెప్పక చెప్పుచున్నది.

వసం :—దేవీ! అట్లైనచో మేము గెలిచితి మన్నమాటే. (చేతులుజాపి సంతోషముతో నృత్యము సేయుచుండును. కక్షము నుండి చిత్రఫలకము జారి క్రిందపడును. దానినిజూచి విదూషకుఁడు విషణ్ణుఁడగును. రాజు ప్రక్కకుఁ దిరిగి వ్రేలితో చిత్రఫలకమునుజూపుచు విదూషకుని ముఖముచూచును.]

వసం :—[ప్రక్కకుఁ దిరిగి] ప్రభూ! కోపింపవలదు. నీవూరకుండుము. ఈ విషయము నేనే సమర్థించుకొందును.

కాంచ :—(ఫలకమును గ్రహించి) దేవీ! ఈ చిత్రపటమును దిలకింపుఁడు.

వాస :—(తేరిపారి చూచి తనలో) ఇతఁడు మహారాజు. ఈమె సాగరిక. (ప్రకాశముగ రాజునుజూచి కోపోపహాసములతో) ఆర్యపుత్రా! ఇదేమైయుండును ?

రాజు :—(వెలవెలఁ బోవుచు ప్రక్కకుఁ దిరిగి) మిత్రమా! ఏమని చెప్పుదును?

వసం :—(నెమ్మదిగ) ప్రభూ! చింతిలకుము. దీనికి సమాధానము నేను చెప్పెదను. (వాసవదత్తను జూచి ప్రకాశముగ) అమ్మా! ఎవరి చిత్రము వారు వ్రాసికొనుట చాల కష్టమని నే నంటిని. కష్టముకాదు సుకరమే అని ప్రభువుల వాదము. దానిని రుజువు చేయుటకై స్వీయవిజ్ఞానము నిట్లు ప్రభువులు ప్రదర్శించి యున్నారు.

రాజు :—(విలక్షణముగ నవ్వుచు) అవు నవును. వసంతకుఁడు చెప్పినట్లే జరిగినది.

వాస :—(ఫలకము నిర్దేశించి) ఆర్యపుత్రా! మీ ప్రక్కగా లిఖింపఁబడిన యీమె వసంతకుని విజ్ఞానమా?

రాజు :—(వెఱ్ఱినవ్వు నవ్వుచు) దేవీ! అన్యథా శంకింపవలదు. ఊహా కల్పితయగు నొకానొక కన్యకామణి యిట్లు లిఖింపఁ బడినది. అంతియకాని వాస్తవముగ మే మీమెనుజూచి యెఱుఁగము.

వసం :—సత్యము. యజ్ఞోపవీతము పట్టుకొని ప్రమాణముచేయుచున్నాను. మే మీమె నెప్పుడును నెక్కడను జూచియుండ లేదు. (ప్రమాణముచేయును.)

కాంచ :—(ప్రక్కకుఁ దిరిగి) మహారాణీ! ఒక్కొకప్పుడిట్టి ఘుణాక్షరమునకును సంభవ ముండును. తమరంతగా కోపింప నక్కఱ లేదు.

వాస :—(ప్రక్కకుఁ దిరిగి) ఓసి పోవే! అమాయికురాలా! ప్రభువుల వక్రభణితములు నీ కేమి తెలియును. ఇతఁడు వసంతకుఁడు సుమా! (రాజునుజూచి ప్రకాశముగ) ఆర్య పుత్రా! ఈ చిత్రపటమును జూచినప్పటినుండి నాకు శీర్ష వేదన మధిక మగుచున్నది. మీరు సుఖముగా నుండుఁడు. నేను పోయివత్తును. (వెళ్ళఁబోవును.)

రాజు :—(చీర చెఱఁగు పట్టుకొని) దేవీ! నిన్నేమని బ్రతిమాల వలెనో నాకిప్పుడు తెలియకున్నది. నీ ముఖమున కోప భావమే ప్రకటితము కానప్పుడు "ప్రసన్నురాలవగు" మన్న మాట పొసఁగఁజాలదు. పోనీ! ఇట్టి పనులను మఱెప్పుడును జేయఁబోనని యన్నచో నాకు తప్పిదము నంగీకరించినట్లే యర్థమగును. నావల్ల లవలేశమైనను దోషము లేదని నుడువుద మన్నను నిదియు నసత్యముగనే నీవు భావింపఁగలవు.

వాస :—(సవినయముగ చీరచెఱఁగు వెనుకకు లాగికొనుచు) ఆర్యపుత్రా! తమరు మఱియొక విధముగా తలంచవలదు. నిజముగా తలనొప్పి నన్ను బాధించుచున్నది. నేనింక నిట నుండఁజాలను. పోయివచ్చెదను. సెలవు.

(వాసవదత్త, కాంచనమాల నిష్క్రమింతురు.)

వసం :—ప్రభూ! అదృష్టవంతుఁడవయ్యా! అకాలవాతూలిక యయ్యును వాసవదత్త క్షేమముగా దాటిపోయినది.

రాజు :—ఛీ. మూర్ఖుఁడా! చాలు సంతోషము. మహారాణి

కోపానుబంధ మతి నిగూఢము. నీవు గ్రహింపవైతివి. చూడు. ఈమె హఠాత్తుగ భ్రూభంగము దాల్చియున్నను ముఖమందలి సహజ నమ్రతను వీడలేదు. నాకు మాత్రమే అర్థ మగునట్లు విలక్షణముగ చిఱునగవు ప్రదర్శించినను పరుషవచనములను పన్నెత్తు మాటయుఁ బలుకలేదు. గంభీర స్వభావురాలగుటంజేసి గ్రుడ్ల నీరు గ్రుక్కకొనెనేకాని గోలుమని యేడ్వలేదు. ఈ విధముగ కోపప్రక్రియముల రెంటిని మహారాణి ప్రదర్శించినదై యున్నది.

వసం :—ప్రభూ! వాసవదత్త వెళ్ళిపోయినది. ఇఁక నీ యరణ్యరోదన మెందులకు?

రాజు :—సరే. రమ్ము. అంతఃపురమునకే పోయి దేవిని బ్రతిమాలు కొందము.

(అందఱు నిష్క్రమింతురు.



# తృతీయాంకము

(మదనిక ప్రవేశించును.)

మద :—(ఆకాశమువంక చూచి) కౌశాంబికా! ప్రభువుల సన్నిధానమునఁ గాంచనమాల యుండుట నీవు నిజముగాఁ జూచితివా? (చెవియొగ్గి) ఏమనుచుంటివి? ఆమె వెళ్లి చాల సేపైనదనియా? ఇపుడామె యెచ్చటికిఁబోయి యుండును? (ముందుకుఁజూచి) ఓహో! కాంచనమాల యిటే వచ్చుచున్నదే! సమీపించి మాట్లాడెదను.

(కాంచనమాల ప్రవేశించును.)

కాంచ :—(పరిహాసముతో) భేష్. వసంతకా! భేష్. సంధి విగ్రహవిజ్ఞానములో యౌగంధరాయణునిఁ గూడ తలఁదన్నిపోతివి.

మద :—(చిఱునగవుతో) కాంచనమాలా! వసంతకుఁడేమి చేసినాఁడమ్మా! అతని నింతగా శ్లాఘించుచున్నావు.

కాంచ :—మదనికా! నీ వెందుల కిట్లడిగెదవు. నీ నోటిలో నూవుగింజ దాగదు గదా!

మద :—కాంచనమాలా! ఇదిగో. దేవీచరణములను స్పృశించి ప్రమాణము చేయుచున్నాను. నే నీ రహస్యము నెరికిని వెల్లడించను.

కాంచ :—అగుచో వినుము. నేఁటి దినమున దర్బారునుండి

నేను బయలుదేరి వచ్చుచుండఁగా చిత్రశాలికా ద్వారము నొద్ద సుసంగతా వసంతకులకు జరిగిన సల్లాపమును విని యుంటిని.

మద :—(కౌతుకముతో) సఖి ! ఆ సల్లాపమెట్టిది ?

కాంచ :—ఇట్టిది. "సుసంగతా ! సాగరిక, వినాగా ప్రభువుల యనారోగ్యమునకు వేఱొండు కారణము గానరాదు. దీని కేదేని యుపాయ మాలోచింపుము." అని.

మద :—అప్పుడు సుసంగత యేమన్నది ?

కాంచ :—సుసంగత యిట్లు చెప్పినది. "చిత్రఫలకవృత్తాంతముచే అనుమానించిన వాసవదత్త సాగరికారక్షణము నా కప్పగించి పారితోషికముగా తాను ధరించెడి విలువగల దుస్తులను గూడ నా కొసగియున్నది. ఆ దుస్తులతో సాగరికకు వాసవదత్తావేషము వేయించి నేను కాంచమాలా వేషము ధరించి ప్రదోషసమయ మగుసరికి ప్రభువుల యొద్దకు రాఁగలను. అంతదనుక నీ విచ్చటనే యుండి మమ్ము నిరీక్షించుచుండుము. తరువాత మాధవీలతా మండపమున సాగరికకును ప్రభువులకును సమావేశము జరుగఁ గలదు." అని.

మద :—ఓసీ ! సుసంగతా ! ఎంతదానవే ! పరిజనవత్సలయగు వాసవదత్తను గూడ వంచింప సమకట్టితివా ?

కాంచ :—మదనికా ! ఇపుడు నీ వెచ్చటికి బయలుదేరితివి !

మద:—అస్వస్థ శరీరులై యున్న ప్రభువుల కుశల వృత్తాంతము తెలిసికొనుటకై వెళ్ళిన నీ వింతవఱకును రాకుండుటంజేసి మహారాణి వెతనొందుచు తిరిగి నన్ను నీ కడకే పంపియున్నది.

కాంచ:—మహారాణి వట్టి అమాయికురాలు. అగపడిన వారి నందఱను విశ్వసించును. (పరిక్రమించి చూచి) అస్వస్థతామిషచే మదనబాధను గప్పిపుచ్చుచు మహారాజిపుడు దంతతోరణవలభి నధివసించి యున్నాఁడు. ఇఁక రమ్ము. ఈ వృత్తాంతమును మహారాణికి విన్నవింతము.

(నిష్క్రమింతురు.)

(రాజు మదనావస్థను నటించుచుఁ బ్రవేశించును.)

రాజు:—(ఉత్కంఠతో నిట్టూర్పువిడిచి) హృదయమా! స్మరావలక్షిత సంతాప మిట్టిది సహించిననే తీరవలెను. దీనికిఁ బ్రతిక్రియోపాయము గానరాదు. వ్యర్థముగ నాయాసపడెద వేల? చందనరసస్పర్శగల ఆ యువతీ హస్తమును దైవవశమున ఆనాఁడు పొందియు హృదయముపై నిడుకొననైతిని. ఎంత మూఢుఁడను. మనస్సును స్వభావచంచలమనియు దుర్లక్షమనియుఁ బెద్దలు పల్కుదురు. కాని యట్లనుట సత్యముకాదు. సత్యమేయగుచో నా మనస్సును సకల శిలీముఖములతో మదనుఁడు ప్రహరింపఁగల్గుటెట్లు పొసగును? ఇది మిక్కిలి యాశ్చర్యముగ నున్నది. (పైకి

చూచి) ఓ కుసుమధన్వా! నీ బాణములు పంచసంఖ్యాకములనియు వానికి లక్ష్యములు (సాధారణముగ నాబోంట్లు) అసంఖ్యాకము లనియుఁగల ప్రతీతి యిపుడు కేవలము తలక్రిందు లైనది కానోపు. కనుకనే అసంఖ్యాకములగు శరపరంపరలచే నన్నొక్కఁడనే ప్రహరించుచుఁ బంచత్వము నొందించుచుంటివి. (ఆలోచించి) నాకయి నే నంతగా బాధ నొందుటయే లేదు. పాపము. ఆ సాగరిక, నిగూఢకోపసంభారయగు వాసవదత్త కంటఁబడి యెట్లున్నదో కదా? ఏమన, నెల్లరకు నీ సమాచారము తెల్లమయ్యెనని పలువురిలోఁ జిన్నపుచ్చుకొనుచుండెనో? ఏ యిరువురి సంభాషణ వినినను తనదిగనే భావించి యెట్టివెతల నొందుచుండెనో? దరహాసితవదనారవిందలగు చెలిమికత్తియలం గాంచి తా నెట్లు వెలవెలఁబోవుచుండెనో? హృదయనిహితాతంక విధురయై ఆ సాగరిక కాల మెట్లు గడుపుచుండెనో తెలియదు గదా! ఆమె వృత్తాంతము నరసి వచ్చుటకై వసంతకు నంపియుంటిని. అతఁడును రాఁడయ్యె. దైవమా!

(వసంతకుఁడు సంతోషముతోఁ బ్రవేశించును.)

వసం:—(హర్షముతో) ఆశ్చర్య మాశ్చర్యము. నా విన్నవించెడి ప్రియవచన మాకర్ణించినపుడు నా ప్రియవయస్యుఁడెట్టి హృదయానందము నొందఁగలఁడో గదా! నిజముగ కౌశాంబీ రాజ్యలాభము కూడ నతనికట్టి యానందము గలి

గింపదని తలంతును. ఇప్పుడే ప్రభువులకీ ప్రియవార్తను నివేదింతును. (పరిక్రమించి చూచి) ఏమీ! నన్నే నిరీక్షించుచు ప్రభువులిచ్చే చూచుచున్నారు. దగ్గరకుఁబోయెదను. (సమీపించి) మహారాజునకు జయము. ప్రభూ! సమీహిత కార్యసిద్ధిచే తమరెంతయు ధన్యులరు.

రాజు :—(సంతోషముతో) మిత్రమా! సాగరికకు క్షేమమేనా?

వసం :—(సంతోషముతో) త్వరలో తమరే తెలిసికొనఁగలరు.

రాజు :—(సంతోషముతో) మిత్రమా! దర్శనము కూడా సంభవించునా?

వసం :—(గర్వముతో) ఎందుకు సంభవింపదు? బృహస్పతిని సైతము ధిక్కరించిన బుద్ధి వైభవముగల నేను నీ కమాత్యుఁడనై యుండఁగా నెందుకు సంభవింపదు?

రాజు :—(నవ్వి) అవును. ఇందేమియుఁ జిత్రము కానరాదు. నీవు తలంచి కొనినచో నెంతపనియైనను సిద్ధించి తీరును. సరేకాని ఏదీ! చెప్పుము. విపులముగా వినవలతును.

(విదూషకుఁడు చెవిలోఁ జెప్పును.)

రాజు :—(సంతోషముతో) మిత్రమా! ఇదిగో. నీకు బహుమానము. (హస్తమునుండి సువర్ణకటకము నూడఁదీసి యిచ్చును.)

వసం :—(కటకము ధరించి చూచుకొని) సరే. ఇంటికిఁబోయి సువర్ణ కటక మండితమగు నీ హస్తముతో నిల్లాలిని నేక వేయుదును. (వెళ్ళబోవును.)

రాజు :—(వసంతకుని చేయిపట్టుకొని వారించుచు) మిత్రమా! వెళ్ళుదువుగాని యిపుడు ప్రొద్దెంతయైనదో తెలిసికొనుము.

వసం :—చిత్తము (పరిక్రమించి చూచి సంతోషముతో) ప్రభూ! గుర్వనురాగోత్క్షిప్త హృదయుఁడై వారుణీవధూ దత్త సంకేతునివలె సహస్రకిరణుఁడస్తగిరి శిఖరకానన మను సరించుచున్నాఁడు.

రాజు :—(చూచి సంతోషముతో) మిత్రమా! బాగుగాఁ జూచితివి. అస్తమయ మాసన్నమగుచున్నది. ఏమన, నొక చక్రముగల తన రథము సుదీర్ఘమగు లోకయాత్ర నొనర్చి తిరిగి ప్రాతఃకాలముననే యింత ప్రయాణమొనరించుట కోపి యుండదని చింతాక్రాంతచిత్తుఁడైనట్లుగ నీ దినకరుఁ డస్తాద్రి నధిష్ఠించి నిజకిరణ నివహముచే దిక్చక్రమునులాగి కుదింపఁ జేయుచున్నాఁడు. మిత్రమా! మనము మాధవీ లతా మండపముననే పోయి ప్రియతమా సంకేత సమ యము నిరీక్షింతము.

వసం :—ప్రభువులు చక్కఁగాఁ బల్కినారు. (లేచి) మహా రాజా! ఈ తిమిర సంఘాతము తూర్పుదిశ నెట్లా వరించు చున్నదో చూడుము. ప్రథమమున, తూర్పునందే బయలు

దేరియుఁ బిమ్మట దిగంతరములను గూడ నావరించి క్రమ క్రమముగ నద్రి ద్రుమ పురవిభాగముల నాక్రమించి తుదకుఁ బ్రజల దృష్టిపథము గూడఁ గప్పివేయుచున్నది. ప్రభూ! ఇదిగో! మాధవీలతా మండపము సమీపించితిమి. తమ రిచ్చటనే యుండుఁడు. నేను బోయి దేవీవేష ధారిణియగు సాగరికను శీఘ్రముగాఁ దోడ్కొని వచ్చెదను.

రాజు :— మిత్రమా! త్వరగా వెళ్ళవోయీ!

వసం :— ప్రభువులు తొందరపడవలదు. ఇప్పుడే పోయివచ్చెదను. (నిష్క్రమించును.)

రాజు :— వసంతకుఁడు వచ్చునంతలో నే నీ మరకతశిలా వేదిక నధిష్ఠించి సంకేతసమయము ప్రతిపాలించెదను. (కూర్చుండి ఆలోచించుచు) ఆహాహా! సూాత్న జనులయొకఁ గాముకుల కౌతుకము స్వగృహిణీ సమాగమ పరిభావికదా!

(వాసవదత్త, కాంచనమాల ప్రవేశింతురు.)

వాస :— కాంచనమాలా! సాగరిక నా వేషమును ధరించి యార్యపుత్రు ననుసరింపఁ బోవుట సత్యమేనా?

కాంచ :— అమ్మా! అసత్యములను దేవికెట్లు విన్నవింతుము? అదె వా. చిత్రశాలికా ద్వారము నొద్ద సుఖాసీనుఁడై యున్న వసంతకుఁడే మీకీయొకఁ దార్కాణ కాఁగలఁడు.

వాస :— సరే. అచ్చటికే పోవుదము. పద.

కాంచ :— ఇటు దయచేయుఁడు. (ఇద్దరు పరిక్రమింతురు.)

(ముసుగు వేసికొని వసంతకుఁడు కూర్చుండును.)

వసం :—(చెవియొగ్గి) అడుగుల చప్పుడు వినవచ్చుచున్నది. సాగరిక వచ్చుచున్నదేమో!

కాంచ :—చిత్రశాలికాద్వార మిదే. వసంతకుఁ డిచటనే యున్నాఁడు. మనము వచ్చినట్లు సైగ చేసెదను.

(చిటిక వేయును.)

వసం :—(సంతోషముతో సమీపించి చిఱునగవుతో) సుసంగతా! కాంచనమాలా వేషము చక్కఁగా ధరించినావే! మఱి సాగరిక యెక్కడ?

కాంచ :—(వ్రేలితోఁ జూపుచు నెమ్మదిగ) ఇదిగో.

వసం :—(చూచి ఆశ్చర్యముతో) ఈమె నిజముగా వాసవదత్తయే.

వాస :—(తనలో) ఏమీ! నన్నీతఁడు గుర్తించెనా? మఱి యొక వైపునకుఁ బోవుదును. (వెళ్ళును.)

వసం :—ఓ సాగరికా! ఇటు దయచేయుము.

(వాసవదత్త నవ్వుచు కాంచనమాలవంక చూచును.)

కాంచ :—(పక్కకుఁ దిరిగి వ్రేలితో విదూషకుని తర్జించుచు) హంతాశ! ఈ మాటలను జ్ఞప్తియందుంచుకొమ్ము.

వసం :—సాగరికా! త్వరపడవలెను. తూర్పుదిశనుండి మృగలాంఛనుఁ డుదయించుచున్నాఁడు.

వాస :—(కంగారుతో ప్రక్కకుఁ దిరిగి) భగవన్! మృగ

లాంఛన ! నమస్కారము. ఇతని భావానుబంధము గుర్తించు నంతపఱకు క్షణకాలము నీవు చాటుననుండుము.

(అందఱు బయలుదేరుదురు.)

రాజు :—(ఉత్కంఠతో తనలో) ప్రియాసమాగమ సమయము సమీపించినకొలది పూర్వాభ్యధికముగ నా మనస్సు పరితపించుచున్నది.

వసం :—సాగరికా ! మా మిత్రుఁ డుత్కంఠానిర్భరుఁడై నిన్నే నిరీక్షించుచున్నాఁడు సుమా ! నీ రాక నతనికి విన్నవింపుము.

(వాసవదత్త తలయూఁచును.)

వసం :—(రాజునుసమీపించి) ప్రభూ ! సాగరికను దోడ్కొని వచ్చితిని.

రాజు :—(సంతోషముతో హఠాత్తుగ లేచి) మిత్రమా ! ఏదీ సాగరిక ? ఎచ్చటనున్నది ?

వసం :—(భ్రూభంగముతో) ఇదిగో.

రాజు :—(సమీపించి) ప్రియా ! సాగరికా ! ఏమి నీ సౌందర్యము ? ముఖము చంద్రబింబము. చూపు లుత్పలములు. కరములు కమలములు. ఊరువులు రంభానిభములు. బాహువులు తమ్మితూఁడులు. ఓ ఆహ్లాదకరాఖిలాంగీ ! నిశ్శంకముగ నన్నాలింగన మొనర్చి అనంగతాపవిధురము లగు నా యవయవముల నానందింపఁ జేయవా !

వాస :—(ప్రక్కకుఁ దిరిగి కాంచనమాలతో) నా సమక్షమందే ప్రభువులిట్లు పల్కుచున్నారు గదా ! తిరిగి నన్నెట్లు పల్కరింతురో ?

కాంచ :—(ప్రక్కకుఁ దిరిగి) అమ్మా ! అక్కడ కదియు నిక్కడ కిదియు రెండును జరిగితీరును. సాహసికు లయిన పురుషు లెంతకుఁజాలరు ?

వసం :—సాగరికా ! నిర్భయముగ మా ప్రభువులను బల్కరింపుము. నిత్యరుష్టయగు వాసవదత్తదుష్టవచనములచే మా చెవు లింతవఱకు చిల్లులు వడి జల్లెడలైనవి. నీ మృదు మధుర వచనోపన్యాసముచే హాయిని గొల్పుము.

వాస :—(ప్రక్కకుఁ దిరిగి) కాంచనమాలా ! వింటివిగదా ! నేను కటుక వచనయఁట. ఈ వసంతకుఁడు ప్రియంవదుఁడు కాఁబోలు.

కాంచ :—(ప్రక్కకుఁదిరిగి వ్రేలితో వసంతకుని భయపెట్టుచు) హా తాళ ! ఈ మాటలన్నియు జ్ఞప్తియుంచుకొమ్ము.

వసం :—(చూచి) ప్రభూ ! కుపితకామినీకపోల సన్నిభుఁడై భగవానుఁడు మృగలాంఛనుఁ డుదయించు చున్నాఁడు.

రాజు :—(చూచి ఆశ్చర్యముతో) ప్రియా ! చూడుము. నీ ముఖ కాంతిచేఁ బరాజితుఁడై యీ నిశానాథుఁడు పగఁ దీర్చుకొను తలంపునఁ గావలయు శైలశిఖరమధిష్ఠించి యూర్ధ్వకిరణుఁడై వెలుగొందుచున్నాఁడు. అసలీ చంద్రుఁ డెందుల కుదయింపవలెను ? పద్మకాంతులను విహతముచేయు, నయ

నందమును గలుగఁజేయ, ఝుషకేతనుని బెంపొందింప నీముఖ చంద్రుఁడే చాలును గదా! పోనీ. అమృతము కలదన్న దర్పముతో నుదయించి యుండునా! ఆ యమృతముకూడ నీ బింబాధరమున నుండనే యున్నదిగదా!

వాస:—(రోషముతో మునుగుదీసి) ఆర్యపుత్రా! నిజముగ నేను సాగరికనా? సాగరికాహృదయులైన తమకు సర్వము సాగరికామయముగనే యగపడుచున్నదికావల యును.

రాజు:—(చూచి వెలవెలఁ బోవుచు, ప్రక్కకుఁ దిరిగి) అయ్యయ్యో! ఎంత మోసపోతిని? ఎంత కష్టము? ఈమె వాసవదత్తాదేవియా! మిత్రమా! ఏమి యీఘోరము?

వసం:—ప్రభూ! ఏమున్నది? జీవితసంశయము సిద్ధమైనది.

రాజు:—(మోకరించి దోసిలియొగ్గి) ప్రియా! వాసవదత్తా! ప్రసన్నురాలవగుము.

వాస:—(ఏడ్చుచు) ఆర్యపుత్రా! అట్లనకుఁడు. ఆ దినములు గడచిపోయినవి.

వసం:—(తనలో) ఇప్పుడెట్టి యుపాయము పన్నవలెనో? సరే. (ప్రకాశముగ) అమ్మా! మాప్రభువుల యీయేకై కాపరాధమును క్షమింపఁగోరుచున్నాను.

వాస:—ఆర్యవసంతకా! ఇంకు ప్రభువుల యపరాధ మేము న్నది? ప్రథమసంగమమున కంతరాయము గల్పించిన నేను గదా అపరాధను.

రాజు :—అంతయుఁ బ్రత్యక్షముగ కనులారఁ జూచిన విషయములో మాటాడుట కింకేమున్నది. అయినను విన్నవించుచున్నాను. దేవి! నీ పాదములపై శిరమును బడవైచి లాక్షాకృతరక్తిమను తుడిచివైచెదను. ముఖేందుబింబమునఁ గల కోపోపరాగముగూడ పోఁగొట్టెదను. నాయెడ సుప్రసన్నవై యథాపూర్వముగ నుండఁగోరెద. (పాదములపైఁ బడును.)

వాస :—(వారించుచు) ఆర్యపుత్రా! లెండు లెండు. వెన్నవంటి మీహృదయమును గుర్తెఱింగియుఁ గోపమును త్యజింపని నేనే సిగ్గుమాలినదానను. (అని పోఁ బోవును.)

కాంచ :—అమ్మా! ప్రభువుల ననుగ్రహింపుఁడు. పాదములపైఁ బడిన ప్రాణవల్లభుని బరిత్యజించి మీరిపు డంతఃపురమునకుఁ బోయినను, మఱింత పశ్చాత్తాపసంతప్తులయ్యెదరు.

వాస :—ఓసి పోవే పిచ్చిదానా! నిగ్రహమునకుగాని యనుగ్రహమునకుఁగాని యిట పనేమున్నది. ఇఁక రా. పోదము. (నిష్క్రమింతురు.)

వసం :—ప్రభూ! ఇఁక లేవయ్యా! వాసవదత్త వెళ్లిపోయినది. ఇంకెందులకీ యరణ్యరోదనము?

రాజు :—(ముఖమెత్తి) ఏమీ! వాసవదత్త వెళ్లినదా? నన్ననుగ్రహింపకయే వెళ్లినదా?

వసం—అనుగ్రహింపకేమి? బాగుగనే యనుగ్రహించినది. కనుకనే మన మక్షతశరీరులమై మనఁగల్గితిమి.

రాజు :—ఛీ. మూర్ఖుఁడా! నన్నిపుడు పరిహసించుచుంటివా? ఈ యనర్థమంతయు నీ మూలముననే వచ్చిపడినది.

వసం :—ప్రభూ! ముక్కోపియగు వాసవదత్త యింకేమి చేయనున్నదో? సాగరిక మాత్రము కడుంగడు వెతలపాలగునని తలంతును.

రాజు :—మిత్రమా! నేను నట్లే తలంచెదను. హా! ప్రియా! సాగరికా!

(వాసవదత్తవేషము ధరించిన సాగరిక ప్రవేశించును.)

సాగ :—(విచారముతో) అదృష్టవశమున నితరు లెఱుఁగకుండునట్లుగ నే నీవేషము ధరించి యెట్లెట్లో యిచ్చటి కరుగుదెంచితిని. ఇఁక నిట నేమి చేయవలెనో? (కన్నీటితో విచారించును.)

వసం :—ప్రభూ! స్తబ్ధులరై యుంటిరేల? అపరాధప్రతీకారము నాలోచింపుఁడు.

రాజు :—మిత్రమా! అదే ఆలోచించుచుంటిని. దేవీప్రసాదము తప్ప వేఱొండుపాయము కానరాదు. రమ్ము. అచ్చటికే పోవుదము. (పరిక్రమింతురు.)

సాగ :—(కన్నీటితో) ఇఁక స్వయముగ నురిపోసికొని మరణించుటయే వరమని తలంతును. అట్లొనర్పనిచో సంకేతవృత్తాంతము నెఱింగిన వాసవదత్తచే, సుసంగతవలె నేనును

పరాభవము నొందవలసి యుండును. ఈ యశోకపాదపము నొద్దకుఁ బోయి ఉరి పోసికొని యసువులఁ బరిత్యజించెద.

వసం:—(ప్రక్కకుఁ దిరిగి) ఆగుమాగుము. అడుగుల చప్పుడు వలె వినఁబడుచున్నది. పశ్చాత్తప్తహృదయయై వాసవదత్తయే తిరిగి యిచటికి వచ్చుచున్నదేమో!

రాజు:—మిత్రమా! వాసవదత్త మహానుభావురాలు సుమా! ఒకవేళ నిట్లే జరుగవచ్చును. శీఘ్రముగాఁ బోయి చూడుము.

వసం:—చిత్తము. (నిష్క్రమించును.)

సాగ:—(సమీపించి) ఈ మాధవీలతతోనే పాశము రచించి యీ యశోకవృక్షముకడ నురిపోసికొని మరణింతును. (లతాపాశము తయారు చేయుచు) ఓ తలిదండ్రులారా! ఈ దిక్కులేని దీనురాలిప్పుడు మరణించుచున్నది.

(ఉరిపోసికొనును.)

వసం:—(చూచి) ఎవరీమె? అయ్యో! వాసవదత్తాదేవియే! (కంగారుతో బిగ్గరగ) ఓ ప్రభూ! ఓ ప్రభూ! రక్షింపుము. రక్షింపుము. మహారాణి యురిపోసికొని మరణించుచున్నది.

రాజు:—(హఠాత్తుగవచ్చి కంఠమునుండి లతాపాశము తొలఁగించుచు) ఓ సాహసకారిణీ! ఇట్టి అకార్యమున కొడిఁగట్టితివేమి? ప్రియా! లతాపాశము నీగళసీమ నిక్షిప్తమైనంత మాత్రముననే హృదయమునుండి నాప్రాణములన్నియుఁ

గదలబాఱి కంఠగతములై యున్నవి. కావున, నిట్టి సాహస మాచరింపకుము.

సాగ :—(రాజునుగాంచి) ఓహో ! ప్రభువులా ! (సంతోష ముతో తనలో) ఇతనిని జూచినంతనే నిజముగా నాకుఁ దిరిగి జీవితేచ్ఛ పొడముచున్నది. అథవా ఒక్కసారి యిత నిని కనులారఁ గాంచి ధన్యురాలనై సులభముగా నసువులఁ బరిత్యజింతును. (ప్రకాశముగ.) ప్రభువులు నన్ను విడిచిపెట్ట వలెను. ఈ వ్యక్తి యిప్పుడు పరాధీనయై యున్నది. అసు పరిత్యాగమున కిట్టి మంచి యదను మఱి దొరకఁజాలదు. ప్రభువులు వాసవదత్తయెడ నిరంతరము నిరపరాధులుగ నుండవలెననియే నేను గోరుచుంటిని.

రాజు :—(తేఱిపాఱి చూచి సంతోషముతో) ఏమీ ! నా ప్రియురాలయిన సాగరికవా ! (కంఠమునుండి లతాపాశము తీయుచు.)

చాలు చాలును నీదగు సాహసంబు
పాఱవేయుము వేగ మీ పాశములను
కదలఁ బాఱిన యసువులఁ గాచుకొఱకు
బాహుపాశమ్ము గళసీమఁ బాదుకొల్పు ;

(అని బాహుపాశము నెత్తి కంఠమున ధరించి స్పర్శ సుఖము నభినయించుచు విదూషకునిఁజూచి) మిత్రమా ! మబ్బులేని వాన యిదేసుమా !

వసం :—ప్రభూ ! నిజమే. తుఫానువలె వాసవదత్త తిరిగి రాకున్నచో.

(వాసవదత్త, కాంచనమాల ప్రవేశింతురు.)

వాస :—కాంచనమాలా ! ఆ విధముగఁ బాదములపై వ్రాలిన యార్యపుత్రుని నప్పుడు క్రోధమున చాల కఠినముగఁ బ్రవర్తించితిని. నేనే యిప్పుడు స్వయముగఁ బోయి ప్రభువుల ననునయించెద.

కాంచ :—అమ్మా ! గంభీర హృదయులగు తమరుగాక మఱెవ్వ రిట్లు మాటాడఁగలరు ? ఆ దోషము ప్రభువులయొద్దనే యుండనిండు. తమరు దయచేయుఁడు. (ఇద్దరు పరిక్ర మింతురు.)

రాజు :—ఓ ముద్దరాలా ! ఇంకను తటస్థముగనుండి మమ్ము విఫల మనోరథులను జేయుచున్నావేల ?

కాంచ :—(చెవియొగ్గి) అమ్మా ! సమీపముననే ప్రభువుల మాటవలె వినవచ్చుచున్నది. మహారాణి ననునయించుటకై ప్రభువులే విచ్చేయుచుండిరేమో ? త్వరలో తమరే సమీ పింపుఁడు.

వాస :—(సంతోషముతో) అట్లైనచో రహస్యముగ వెను కకుఁబోయి ప్రభువుల ననుసరించెదను.

వసం :—ఓ సాగరికా ! స్వేచ్ఛగ నా ప్రియవయస్యుని బలుక రింపవేల ?

వాస :—(విని విచారముతో) కాంచనమాలా ! సాగరిక యిచటనే యున్నది సుమా ! సరే. ముందు వీరి సంభా షణము విందము. తరువాత ప్రభువులను సమీపింతము. (సంభాషణ వినుచుండును.)

సాగ :—మహారాజా ! ఈ యలీకదాక్షిణ్య మెందులకు ? ప్రాణముల కన్నను మిన్నయగు వాసవదత్తయెడఁ దిరిగి యపరాధులు కాఁబోకుఁడు.

రాజు:—ప్రియా! నీ వబద్ధము లాడుచున్నావు. నిజముగా వాసవదత్తపై నాకుఁగల ప్రేమ కేవల మాభిజాత్యజనితము. నీయందన్ననో వా స్తవికము, సహజము, నైసర్గికము.

వాస :—(సమీపించి రోషముతో) ఆర్యపుత్రా ! చక్కఁగాఁ బల్కితిరి.

రాజు :—(చూచి వెలవెలఁబోవుచు) దేవీ ! నన్ను నిష్కారణముగ నిందింపకుము. వేషసాదృశ్యముచే నీపెను నిన్నుగ భావించి యిటకు వచ్చితిమి. కావున క్షమింపుము.

(పాదములపైఁ బడును.)

వాస :—(రోషముతో) ఆర్యపుత్రా ! లెమ్ము. లెమ్ము. అభిజాత్యజనిత మగు సేవాధర్మముతో నింకను గష్టపడెద రేల ?

రాజు :—(తనలో) అయ్యయ్యో ! ఈ మాటకూడ విన్నదా? ఇంక దేవీ ప్రసాదమున కుపాయమే లేదు. (అధోముఖుఁడయి నిలఁబడును.)

వసం :—దేవీ ! తమరే ప్రాణములఁ బరిత్యజించు చున్నారని వేష సాదృశ్యముచే భ్రాంతిఁజెంది మా ప్రభువుల నిటకు నేనే గొనితెచ్చినాఁడ. నా పలుకులను విశ్వసింపకున్నచో నిదిగో ఈ లతాపాశము చూడుఁడు.

(లతాపాశము చూపును.)

వాస :—(కోపముతో) కాంచనమాలా ! ఈ లతాపాశముతో ముందీ బ్రాహ్మణుని రెక్కలువిఱిచి కట్టుము. ఈ దుష్ట కన్యను సాగరికను గూడ ముంగుకుఁ దీసికొనిరమ్ము.

కాంచ :—చిత్తము. (లతాపాశముతో వసంతకుని బంధించి కొట్టుచు) హతాశ ! అవినయ ఫల మనుభవింపుము. దేవీ దుష్టవచనములచే చెవులు చిల్లులుపడి జల్లెడలైనవంటివే ! ఆ మాట జ్ఞప్తికిఁ దెచ్చుకొమ్ము. (సాగరికవంక చూచి) సాగరికా ! పద. ముందుకు పద.

సాగ :—(తనలో) ఈ నిర్భాగ్యురాలు స్వేచ్ఛగ మరణించుటకైనను నోచుకొనలేదా ?

వసం :—(విచారముతో) ప్రభూ ! దిక్కులేని యీ బ్రహ్మచారిని నెల్లనను విడిపించుటకుఁ బ్రయత్నింపఁగోరెద.

(వాసవదత్త రాజును జూచుచు సాగరికావసంతకులను వెంటనిడికొని కాంచనమాలతోఁ గూడ నిష్క్రమించును.)

రాజు —(విచారముతో) ఎంతకష్టము వాటిల్లినది !

దీర్ఘకోపమ్ముగల మహాదేవి కొఱకొ
గాఢసంతర్జ్యమానసాగరిక కొఱకొ
దయితచే బద్ధుడౌ వసంతకుని కొఱకొ
యేరికని యేడ్తు దైవమా । యేది దిక్కు.

ఇంక నిచ్చట నున్నందునఁ బ్రయోజన మేమున్నది. వాసవదత్త ననునయించుట కభ్యంతరమునకే పోయెదను.

(వెళ్లును.)

# చతుర్థాంకము.

(రత్నహారము గ్రహించి కన్నీటితో సుసంగత ప్రవేశించును.)

సుసం:—(నిట్టూర్పు విడిచి) హా! ప్రియసఖీ! సాగరికా! హా లజ్జాలుకా! హా! సఖీగణవత్సలా! హా! ఉదారశీలా! హా! సౌమ్యదర్శనా! ఇపు డెచ్చటనుంటివి? ఎచట నిన్నుఁ జూడఁ గల్గుదును? (ఏడ్చును.) ఓ దయమాలిన పాడుదైవమా! అసామాన్యరూపశోభకలదానినిగ సాగరికను సృజించుటేల? ఈ కష్టపరంపర నామె కాపాదింపనేల? సాగరిక వెళ్లు నప్పుడు జీవితనిరాశయై "ఈ రత్నమాల నేరికేని బ్రాహ్మణు నకు సమర్పింపు" మని నాకిచ్చి యుండెను. ఎవరినైనను బ్రాహ్మణపుంగవు నన్వేషింతును. (తెరవంక చూచి) వసంతకుఁ డిటే వచ్చుచున్నాఁడు. ఈ రత్నమాల నితనికే సమర్పించెదను.

(సంతోషముతో వసంతకుఁడు ప్రవేశించును.)

వసం:—ప్రభువులయెడ సుప్రసన్నయైన వాసవదత్తాదేవిచే బంధ విమోచన మొందుటయేగాక యామె స్వహస్తములతో నొసంగిన మోదకములతో పొట్టనుగూడ దిట్టముగ నిండిం చుకొంటిని. ఇంకను మహారాణి బహూకరించిన యీ నూతనవస్త్రములు ధరించి కర్ణాభరణ మలంకరించుకొని ప్రభువులయొద్దకుఁ బోయెదను. (పరిక్రమించును.)

సుసం :—(ఏడ్చుచు హఠాత్తుగ సమీపించి) ఆర్యవసంతకా! క్షణకాల మాగుము.

వసం :—(చూచి) ఓహో! సుసంగతా! సఖీ! ఎందుల కిచ్చట దుఃఖించుచు నిలఁబడితివి? సాగరికకేమియు నశ్యాహితము జరుగలేదుగదా!

సుసం :—దానినే విన్నవింపఁదలఁచితిని. ఆ సాగరిక నుజ్జయినికిఁ బంపినట్లుగ ప్రవాదము నొండు కల్పించి యర్ధరాత్ర మగుసరికి నెచటికిఁ బంపినదో వాసవదత్త చెయిదమేరికిని బోధపడకున్నది.

వసం :—(విచారముతో) హా! పూజ్యురాలా! సాగరికా! ఓ అసామాన్యరూపశోభా! ఓ మంజుభాషిణీ! నీయెడ మహారాణి చాల దారుణముగఁ బ్రవర్తించినది సుమా! సుసంగతా! తరువాత నేమి జరిగినది?

సుసం :—జీవితనిరాశయైన సాగరిక "ఆర్యవసంతకున కీ రత్నమాల నందఁజేయు" మని యిదివరకే నాకొసంగినది. కావున దీనిని బరిగ్రహింపుము.

వసం :—(చెవులు మూసికొని కన్నీటితో జాలిగ) సుసంగతా! ఈ సందర్భమున చేయిఁ జాపలేకున్నాను.

(ఇరువురు దుఃఖింతురు.)

సుసం :—(దోసిలియొగ్గి సవినయముగ) వసంతకా! సాగరిక యందలి వాత్సల్యముతోనైన నను దీనిని బరిగ్రహింపుము.

వసం :—(ఆలోచించి) సరే. తెమ్ము. అట్లే పరిగ్రహింతును. ఈ రత్నమాలయే సాగరికావిరహాపీడితుఁడైన మాప్రియ వయస్యుని దుఃఖమును గొంతవఱకుఁ బోఁగొట్టఁగలదు.

(సుసంగత రత్నమాల నొసంగును.)

(వసంతకుఁడు పరిగ్రహించును.)

వసం :—(రత్నమాలను జూచి యాశ్చర్యముతో) సుసంగతా! సాగరిక కీ రత్నమాల యెట్లు వచ్చియుండును?

సుసం :—ఆర్యవసంతకా! ఇట్టి కౌతూహలముతోడనే యొక ప్పుడు నేను నామె నడిగియుంటిని.

వసం :—అపుడామె యేమి చెప్పినది?

సుసం :—అపుడామె ఆకసమువంక చూచి దీర్ఘముగ నిట్టూర్పు విడిచి "సుసంగతా! దీనిని దెలిసికొనుటవలన నీకుఁ గల్గెడి లాభమేమున్నది" అని పల్కుచు వెక్కి వెక్కి యేడ్వసాగినది.

వసం :—ఇఁక నేమి? ఈ పరిచ్ఛదము సామాన్యజనదుర్లభ మని యామె చెప్పినట్లే యైనది. సర్వథా సాగరిక మహాభి జనసముత్పన్నయై యుండనోపు. సుసంగతా! ప్రభువులిప్పు డెచ్చట నున్నారు?

సుసం :—వసంతకా! ప్రభువు లిప్పుడే దేవీభవనమునుండి బయలుదేరి స్ఫటికశాలను బ్రవేశించినారు. నీవును నచటి కేగుము. నేనుగూడ వాసవదత్తా సకాశమునకుఁ బోయెదను.

(నిష్క్రమింతురు.)

(ఆసనోపవిష్టుఁడై రాజు ప్రవేశించును.)

రాజు :—(ఆలోచించి) శపథములు, ప్రియవచనములు, పాదపతనములు, సఖీభాషణములు, చిత్తానుసరణము మున్నగునవేవియు వాసవదత్త కోపమును తగ్గించుటకుఁ బనికిరాకపోయినవి. అయినను వాసవదత్తయే కొంతసేపు వెక్కివెక్కి యేడ్చి తుదకుఁ బశ్చాత్తప్తహృదయయై ప్రక్షాళితబాష్పయగుచు స్వయముగనే తనకోపము నంతరింపఁజేసికొన్నది. (ఉత్కంఠతో నిట్టూర్పు విడిచి) వాసవదత్త ప్రసన్నురాలైనది. ఇఁక సాగరికనుగూర్చిన చింతమాత్రము నన్ను పట్టి బాధించుచున్నది. అంభోజగర్భసుకుమారమూర్తియగు సాగరిక యానాఁటి ప్రథమసమావేశసమయమున మదనమార్గణఛిద్రములచే మార్గమేర్పఱిచికొని నాహృదయమును బ్రవేశించినదని తలంతును. (ఆలోచించి) అయ్యయ్యో! నా ప్రియమిత్రుఁడగు వసంతకునిగూడ దేవి బంధించివైచినది గదా! ఇఁక నెవ్వరిదగ్గర విలపింతును? (నిట్టూర్పు విడుచును.)

(వసంతకుఁడు ప్రవేశించును.)

వసం :—(పరిక్రమించి చూచి ఆశ్చర్యముతో) నిర్భరోత్కంఠచే క్రుంగి కృశించియున్నను ప్రభువులు తళతళలాడు తనుకాంతిని వహించుచు విదియనాఁటి చంద్రునివలెఁ జూడ ముచ్చటగనున్నాఁడు. ఇతనిని సమీపించెదను. (సమీపించి) ప్రభువులకు జయము. ఆనాఁడు వాసవదత్తచే నట్లు

బంధించి గొంపోఁబడియున్నను ఈ కన్నులతో మిమ్ముదిఁరిగి చూడఁగల్గితిని.

రాజు :—(చూచి సంతోషముతో) ఓహో ! ప్రాణమిత్రుఁడు సమయమునకు వచ్చినాఁడు. మిత్రమా ! ఒక్కసారి గాఢముగ కౌగిలించుకొనుము.

(విదూషకుఁడు కౌగిలించుకొనును.)

రాజు :—దేవీ యనుగ్రహము నీ ముఖము గాంచినంతనే ప్రస్ఫుటమగుచున్నది. ఇఁక సాగరికాసమాచారము తెలియఁగోరెద.

(వసంతకుఁడు వెలవెలఁబోవుచు నధోముఖుఁడై మాటాడక యూరకుండును.)

రాజు :—మిత్రమా ! మాటాడవేమి ? సాగరికకుఁ గుశలమా ?

వసం :—అప్రియము నివేదింపలేకున్నాను.

రాజు :—(విచారముతో కంగారుపడుచు) మిత్రమా ! అప్రియమా ! సాగరిక నిజముగా మరణించినదా ? హా ప్రియా ! సాగరికా ! (మూర్ఛపోవును.)

వసం :—(కంగారుతో) ప్రభువు లూరడిల్లవలెను.

రాజు:—(కొంచెము తెప్పిరిల్లి, కన్నీటితో) ఓ ప్రాణములారా! ఈ యసమర్థుఁడనగు నన్ను తత్క్షణము పరిత్యజింపుఁడు. నామాట వినుఁడు. నాయెడ దాక్షిణ్యము వహింపుఁడు. నన్నుఁబరిత్యజించి వెళ్లనిచో మీరు కేవలము వంచింపఁ

బడుదురు. ఆ గజగామిని సాగరిక యిప్పటికే చాల దూర మధిగమించి యుండును.

వసం :—ప్రభూ! తమరు మఱియొక విధముగ భావింపవలదు. వాసవదత్త సాగరిక నుజ్జయినికిఁ బంపినట్లుగ వినియుంటిని. అందువలన "అప్రియ" మని మిన్నకుంటిని.

రాజు :—ఏమీ! ఉజ్జయినికిఁ బంపినదా? ఓహో! వాసవదత్త నాయెడ నెంతకాఠిన్యము వహించినది! మిత్రమా! నీకీ సంగతి నెవ్వరు చెప్పిరి?

వసం :—ప్రభూ! సుసంగత చెప్పినది. ఇంకొక్కమాట. ఈ రత్నమాలనుగూడ నాచే నీకడకుఁ బంపియున్నది.

(రత్నమాలను జూపును.)

రాజు :—ఈ సమయములో నన్నూరడించుట కిది తక్క వేఱే మున్నది? మిత్రమా! ఏదీ! రత్నహార మిటు తెమ్ము.

(విదూషకుఁడు రత్నమాల నందిచ్చును.)

రాజు :—(రత్నమాలను గ్రహించి హృదయమందిడికొని తదేక దృష్టితోఁ జూచుచు) ఆహా! ప్రియాశ్లేషమును బొందియుఁ బిమ్మట నటనుండి ప్రభ్రష్టమైన యీ రత్నహారము, తుల్యావస్థగల చెలిమికత్తియవలె నా శరీరము నూరడించుచున్నది. మిత్రమా! దీనిని నీవు ధరింపుము. నిన్నుఁ జూచి యైనఁ గొంత ధైర్యము తెచ్చుకొందును.

వసం :—చిత్తము.

(రత్నహారలను విదూషకుఁడు కంఠమున ధరించును.)

రాజు :—(సబాష్పముగ నిట్టూర్పు విడిచి) మిత్రమా! ప్రియురాలి దర్శనభాగ్య మింక దుర్లభ మేనా?

వసం :—(భయముతో నలుదెసలఁ గలియఁ జూచి) ప్రభూ! ఆమాటలను గట్టిగా అనకుఁడు. గోడలకు చెవులుండును. ఎవరైన నను వినఁగలరు.

(వేత్రహస్తయగు వసుంధర ప్రవేశించును.)

వసుంధర :—(సమీపించి) ప్రభువులకు జయము. మహారాజా! రుమణ్వంతుని మేనల్లుఁడు విజయవర్మ ప్రియవార్తనేదియో దేవరకు విన్నవింపఁదలంచి ద్వారమునొద్ద నిరీక్షించుచున్నాఁడు.

రాజు :—వసుంధరా! శీఘ్రముగ నతనిని లోనికిఁ దీసికొని రమ్ము.

వసుం :—చిత్తము. (నిష్క్రమించి విజయవర్మతో తిరిగి ప్రవేశించి) విజయవర్మా! అరుగో. ప్రభువులిచ్చటనే యున్నారు. సమీపింపుము.

విజ :—(సమీపించి) మహారాజునకు జయము. రాజా! రుమణ్వంతుని విజయముచే ప్రభువులెంతయు నదృష్టవంతులు.

రాజు :—భేష్. రుమణ్వంతుఁడా! భేష్. కొలదికాలముననే కొండంత ప్రయోజనము సాధించితివి. విజయవర్మా! ఇటు కూర్చుండుము. (విజయవర్మ కూర్చుండును.)

రాజు :—(సంతోషముతో) విజయవర్మా! కోసలేశ్వరుఁడోడిపోయెనటే కదా!

విజయ :—ప్రభువుల ప్రభావముచే.

రాజు :—విజయవర్మా! ఆకథనంతయు విస్తరించి చెప్పుము.

విజయ :—ప్రభూ! ఆలకింపుఁడు. ప్రభువుల యాదేశాను సారము కరి తురగ పత్తి కుర్ని వారమగు గొప్ప బలసమూహము వెంటనిడికొని రుమణ్వంతుఁ డిటనుండి బయలుదేరి కొలది దినములలోనే వింధ్యదుర్గావస్థితుఁడగు కోసలేశ్వరుని ద్వారము ముట్టడించి కూర్చుండెను.

రాజు :—తరువాత?

విజయ :—తరువాత కోసలాధిపతియు దర్పభూయిష్ఠుఁడై పరిభవము సహింపనోపక హస్తిప్రాయమగు నిజసైన్యము నాయత్తపఱచికొని యుండెను.

వసం :—త్వరగాఁ జెప్పవయ్యా! నాగుండె లదరిపోవుచున్నవి.

రాజు :—తరువాత?

విజయ :—దేవా! తరువాత వింధ్యభూధరముఁ బోలిన ద్విరద పతియూథముతో దిగ్విభాగముల నరికట్టుచు వింధ్యదుర్గము నుండి బయలుదేరి యుద్ధమొనర్చుటకై కోసలాధిపతి సర్వ సంసిద్ధుఁడై యుండెను. ఇంతకు మునుపే కృతనిశ్చయుఁడైన మన రుమణ్వంతుఁడు గూడ మదగజఘటోత్పిష్టపత్తి యయ్యును బాణవర్షము నమోఘముగఁ గురిపించుచు నమాంతముగ నతనిపైఁబడి ద్విగుణీకృత వేగముతో నెనురు ముట్టడి గావించెను. మఱియు శస్త్రప్రయోగములచేతను

నస్త్రప్రయోగములచేతను మన ప్రధానసైన్యమంతయు నిహతప్రాయమైయుండ, రక్తస్రవంతులు ప్రవహించుచుండ, కవచవినిర్గతవిస్ఫులింగములు విజృంభించుచుండ, రుమణ్వాంతుఁడు మత్తద్విపస్థుఁడగు కోసలాధిపతి నాహ్వానించి,

రాజు :—ఏమీ! మన ప్రధానసైన్యమంతయుఁ నిహతప్రాయమయ్యెనా?

విజయ :—శరశతముచే నతనిఁ దెగటార్చెను.

వసం :—ప్రభువులకు జయము. మనము జయించినాము.

(నృత్యము చేయును.)

రాజు :—సాధు. కోసలపతీ! సాధు. నీపురుషకారము శత్రువులు సైత మిట్లు కొనియాడుటంజేసి, వీరస్వర్గమలంకరించిన నీమరణమెంతయు శ్లాఘనీయము. తరువాత నేమి జరిగినది?

విజయ :—తరువాత రుమణ్వంతుఁడు నా సోదరుఁడగు జయవర్మను గోసలములందుఁ బ్రతిష్ఠించి, ప్రహారవ్రణితహస్తికప్రాయమగు నశేషసైన్యమును వెంటఁబెట్టికొని నెమ్మదిగా నిటకు వచ్చుచున్నాఁడు.

రాజు :—వసుంధరా! ప్రహర్షానుగుణవైభవమును బ్రదర్శింపుమని యౌగంధరాయణునితోఁ జెప్పుము.

వసుం :—చిత్తము. (విజయవర్మతోఁ గలసి నిష్క్రమించును.)

(కాంచనమాల ప్రవేశించును.)

కాంచ :—మహారాజునకీ ఇంద్రజాలికుని జూపవలసినదిగ మహారాణి యాజ్ఞాపించినది. ప్రభువు లిచ్చటనే యున్నారు.

సమీపించెదను. (సమీపించి) ప్రభువులకు జయము. మహా రాజా! సంవరణసిద్ధియను నీయింద్రజాలికుఁ డుజ్జయినినుండి వచ్చియున్నాఁడని దేవరకు మహారాణి విన్నవింపుచున్నది. ఇతనినిఁ దిలకింపుఁడు.

రాజు :—ఇంద్రజాలవినోదము నాకును నిష్టమే. త్వరగా నతనిని లోనికిఁ దీసికొని రమ్ము.

కాంచ :—చిత్తము. (బయలుదేరి యింద్రజాలికునితోఁ దిరిగి ప్రవేశించి) ప్రభూ! ఇడుగో ఐంద్రజాలికుఁడు.

ఇంద్ర :—(సమీపించి) ప్రభువులకు జయము. (పింఛము ద్రిప్పుచు వివిధములగు హాస్యముల నొనర్చి) మహారాజా! కౌశాంబీపతీ! పెక్కుమాట లెందులకు? భూమిపై చంద్రుని, ఆకాశముపై భూధరమును, జలముల జ్వాలనుని, మధ్యాహ్నమునఁ బ్రదోషమును జూపఁగలను. సెల వొసంగుఁడు.

వసం :—ప్రభూ! సావధానుఁడవై యుండుము. వీనివైఖరి చూచినచో నితఁడన్నిఁటికి సమర్థుఁడనియే తోచుచున్నది.

ఇంద్ర :—దేవా! మాటలతోఁ బనేమున్నది? మీరెద్దానిని జూడవలెనని హృదయమున నభిలషించుచుంటిరో దాని నెల్లను బ్రదర్శించెదను. గురుకటాక్షము, మంత్రప్రభావము మాయధీనములు.

రాజు :—భద్రా! క్షణకాలమాగుము. (కాంచనమాలను జూచి) కాంచనమాలా! మహారాణికి విన్నవింపుము.

"మాయూరినుండి వచ్చిన యింద్రజాలికుఁడు తన విద్యను బ్రదర్శింపనున్నాఁడనియు, నిచ్చటి ప్రదేశము విజనీకృతమనియు, నీ ప్రదర్శనము గాంచుటకుఁ దప్పక రావలెననియుఁ జెప్పి ఆమెను శీఘ్రముగఁ దీసికొని రమ్ము."

కాంచ :— చిత్తము. (నిష్క్రమించి వాసవదత్తతోఁ దిరిగి ప్రవేశించును.)

వాస :— కాంచనమాలా! ఇంద్రజాలికుఁడు మాయూరివాఁడు గదా అని అతనిపై నాకెంతయు నభిమానము మిక్కుటమై యున్నది సుమా!

కాంచ :— అమ్మా! నాభికుల బహుమాన మట్లుండదా మఱి!

వాస :— (సమీపించి) ఆర్యపుత్రులకు జయము.

రాజు :— దేవీ! ఇతఁడేమేమియో గర్జించుచున్నాఁడు. సావధానులమై యితని ప్రదర్శనము చూతముగాక.

(వాసవదత్త కూర్చుండును.)

రాజు :— భద్రా! ఇంక నీప్రదర్శన మారంభింపుము.

ఇంద్ర :— చిత్తము. (పింఛము ద్రిప్పుచు, హరిహరబ్రహ్మలను, నింద్రాదిదేవతలను, విద్యాధర సిద్ధ కిన్నర కింపురుషాదులను గగనతలమునఁ బ్రదర్శించి చూపును. అందఱు నాశ్చర్యముతోఁ జూతురు.)

రాజు :— (ఊర్ధ్వముగ దృష్టిని నిగిడ్చి లేచి) ఆశ్చర్యమాశ్చర్యము.

వసం :—ఆశ్చర్యమాశ్చర్యము.

వాస :—ఆశ్చర్యమాశ్చర్యము.

రాజు :—దేవీ ! తిలకింపుము.

ఇతఁడు శంకరుఁ డితఁ డింద్రుఁ డితఁడు బ్రహ్మ
అతఁడు లక్ష్మీశుఁ డవ్వార లమరవరులు
ఘల్లుమని నూపురధ్వను లుల్లసిల్ల
నాట్యమొనరించు వీరలు నాకసతులు.

వాస :—అందఱకు సవినయభక్తిప్రణామము.

(నమస్కరించును.)

వసుం :—ఇంద్రజాలికా! దేవతలను నప్సరస్త్రీలను బ్రదర్శించు టెందులకోయీ! మాప్రభువులు సంతసింపవలెనన్నచో, తగిన పారితోషికము నీవు బడయవలెనన్నచో సాగరికను జూపింపుము.

(వసుంధర ప్రవేశించును)

వసుం :—(రాజును సమీపించి) ప్రభువులకు జయమగుఁగాక. అమాత్య యౌగంధరాయణుఁడు ప్రభువుల చరణసన్నిధి నిట్లు విన్నవించుచున్నాఁడు. "విక్రమబాహువు పంపిన వసుభూతియు, బాభ్రవ్యుఁడును నిటకు వచ్చియున్నారు. ఈ సంతోషసమయమునఁ బ్రభువులు వారిని గౌరవింతురుగాక. మఱియు, కార్యశేషము ముగించుకొని నేనును బ్రభువుల సన్నిధి కేతెంచుచున్నాఁడను" అని.

వాస :—ఆర్యపుత్రా! ఇఁక నీయింద్రజాలికుని఼ బంపివేయుఁడు. మా ప్రథానామాత్యుఁడు వసుభూతి వచ్చియున్నాఁడఁట. ముందు ప్రభువు లతనిని గౌరవింతురుగాక.

రాజు :—అవును. అట్లే చేయుదును. (ఇంద్రజాలికునితో) భద్రా! ఇఁక నీవు సరిపెట్టుము.

ఇంద్ర :—(పింఛమును ద్రిప్పుచు) ప్రభువుల యాజ్ఞ. (నిష్క్రమించుచు) ప్రభువులు చూడఁదగిన ప్రదర్శన మింకొకటి మాత్రము మిగిలియున్నది.

రాజు :—భద్రా ! ఇప్పుడుకాదు. తరువాత చూచెదము లెమ్ము.

వాస :—కాంచనమాలా ! నీవు వెళ్లి యితనికిఁ బారితోషిక మిప్పింపుము.

కాంచ :—వసంతకా ! వసుభూతిని లోనికిఁ దోడ్కొని రమ్ము.

వసం :—చిత్తము. (నిష్క్రమించును.)

(వసుభూతియు, బాభ్రవ్యుఁడును బ్రవేశింతురు)

వసు :—(రాజస్థానము నలుదెసల విలోకించి) ఆహా! ఏమి వత్సేశ్వరానుభావము ? సింహాళేశ్వరవైభవమును సయితము ధిక్కరించుచున్నదే !

బాభ్ర :—వసుభూతీ ! ఇంతకాలమునకుఁ దిరిగి మాప్రభువులను జూడఁ గల్గితిని గదాయని నిజముగ వాగగోచరమగు నానందాతిశయ మనుభవించుచున్నాను. నాయిప్పటి సంతోషము కంపమును బెంపొందించుచు, దృష్టిని గప్పివుచ్చుచు

వాక్కునకు గాద్గద్యము నుందించుచు నాముసలితనమున కెక్కుడు సాహాయ్యకారి యగుచున్నది.

వసం :—(ముందుకు వచ్చి) సింహళేశ్వరుని ప్రధానామాత్యుడు వసుభూతి ఇతడే.

వసు :—(విదూషకుని మెడలోనున్న రత్నమాలను జూచి ప్రక్కకుఁ దిరిగి) బాభ్రవ్యా! ఆనాఁడు సింహళేశ్వరుఁడు రాజపుత్రికకొసంగిన రత్నమాలయే యిది అని తలంచు చున్నాను.

బాభ్ర :—మంత్రిసత్తమా! పోలిక యున్నది. అయినను వసంతకు నడిగి వాస్తవము తెలిసికొందును.

వసు :—బాభ్రవ్యా! వలదు వలదు. రాజాస్థానమున రత్నబాహుళ్యముండుటంజేసి యిట్టిదాని కిచ్చుట సంభవము లేకపోలేదు.

వసం :—(రాజును జూపి) ఇదిగో ప్రభువులు. అమాత్యులు సమీపింతురుగాక.

వసు :—(సమీపించి) ప్రభువులకు విజయము.

రాజు :—(ఆసనమునుండి లేచి) నమస్కరించుచున్నాను.

వసు :—ఇతోఽధికశ్రేయఃపరంపర నందుదురుగాక.

రాజు :—ఎవరక్కడ? అమాత్యుల కాసనము దీసికొనిరండు.

వసం :—(ఆసనముఁ దెచ్చి) ప్రభూ! ఇదిగో ఆసనము. అమాత్యవరా! అలంకరింపుడు.

(వసుభూతి కూర్చుండును.)

బాభ్ర :—మహారాజా! బాభ్రవ్యుఁడను. నమస్కరించు చున్నాను.

రాజు :—(వెనుకవైపునున్న ఆసనమును వ్రేలితోఁ జూపుచు) బాభ్రవ్యా! అటు కూర్చుండుము.

వసు :—అమాత్యశేఖరా! వాసవదత్తాదేవి నమస్కరించు చున్నది.

వాస :—ఆర్యా! నమస్కారము.

వసు :—ఆయుష్మతీ! వత్సరాజును బోలిన పుత్రరత్నమును బొందుదువుగాక. (అందఱు కూర్చుందురు.)

రాజు :—అమాత్యశేఖరా! సింహళేశ్వరునకుఁ గుశలమేనా?

వసు :—(పైకిఁ జూచి నిట్టూర్పువిడిచి) ప్రభూ! ఏమని విన్న వింపవలెనో యీమందభాగ్యునకు బోధపడకున్నది. (అధో ముఖుఁడై యుండును.)

వాస :—(విషాదముతో, తనలో) అయ్యయ్యో! వసుభూతి యిప్పుడెట్టి దారుణవార్త విన్నవింపఁనున్నాఁడోగదా!

రాజు :—అమాత్యపుంగవా! త్వరగాఁ జెప్పుము. మనస్సును గలవరపెట్టకుము.

బాభ్ర :—(ప్రక్కకుఁ దిరిగి చాలసేపు నిదానించి) వసుభూతీ! చెప్పవలసినది చెప్పక తప్పదుగదా!

వసు :—(కన్నీటితో) మహారాజా! విన్నవించుటకే నోరాడ కున్నది. అయినను నీమందభాగ్యుఁడు సాహసించుచున్నాఁడు. "సింహళేశ్వరుని కుమార్తెయగు రత్నావళిని బెండ్లియాడిన

వాఁడు సార్వభౌముఁడు కాఁగలఁడని యొకానొక సిద్ధవచనమును బట్టి,

రాజు :—తరువాత నేమైనది ?

వసు :—మీ ప్రధానామాత్యుఁడు యౌగంధరాయణుఁడు రత్నావళిని మీకొసంగవలసినదిగ నన్ని యోపర్యాయములు మా సింహళేశ్వరుని బ్రార్థించియున్నను నతఁడు మాత్రము వాసవదత్తాచిత్తఖేదమును శంకించి యందుల కంగీకరింపక తటస్థముగ నున్నకుండెను.

రాజు :—(ప్రకటముగఁ దిరిగి) దేవీ ! మీ యమాత్యశేఖరుఁ డిట్టి యబద్ధముల నాడుచున్నాఁ డేమి ?

వాస :—(నిదానముగ విమర్శించి) ఇందెవరిమాట లబద్ధములో నేనెట్లు నిర్ణయింతును ?

వసం :—తరువాత నేమి జరిగినదయ్యా !

వసు :—తరువాతనా ! వాసవదత్త లావాణకవహ్నిసందగ్ధయయ్యెనని కింవదంతిని గల్పించి మీప్రభువుల కారత్నావళిని దిరిగి కోరియుండిరి. పూజ్యుఁడగు మా సింహళేశ్వరుఁడును గొంతతడ వాలోచించి ఎట్లైనను ప్రభువులతోడి సంబంధలోపము జరుగకూడదని నిశ్చయించి రత్నావళిని మీప్రభువులకే యొసంగవలెనని కృతనిశ్చయుఁడై మాతోఁగూడ నామె నిచ్చుటకుఁ బంపియుండ సముద్రమధ్యమున నోడ పగిలిన కారణముగ రత్నావళి మునిగిపోయినది. (అని యేడ్చుచు నధోముఖుఁడై యుండును.)

వాస :—(ఏడ్చుచు) అయ్యో! ఎంత మందభాగ్యురాలను? ఓ సోదరీ! రత్నావళీ! ఇప్పు డెచ్చట నుంటివి? ప్రతివచన మిమ్ము. (మూర్ఛపోవును.)

రాజు :—దేవీ! ఊరడిల్లు మూరడిల్లుము. దైవగతి దురవగాహము. నౌకాభంగముచే పత్నీశోత్థితులైన వీరిరువురే మన కీవిషయమునఁ బ్రబలనిదర్శనము. (అని వసుభూతి బాభ్రవ్యులను జూపును.)

వాస :—ఆర్యపుత్రా! అది సత్యమే కాని యంతటి యదృష్ట మీ మందభాగ్యురాలి కెక్కడిది?

రాజు :—(ప్రక్కకుఁ దిరిగి) బాభ్రవ్యా! ఎంత నిపుణముగ నాలోచించి చూచినను రవంతేనియు నీవిషయము నాకు బోధపడకున్నది.

బాభ్ర :—మహారాజా! అవధరింపుఁడు.

(తెరలోఁ గలకలము)

"అంతఃపురము నలుదెసల మంట లావరించుచున్నవి. సజలజలధరములట్లు ధూమోద్గమములు విజృంభించుచున్నవి. జ్వలనజ్వాలలన్నియు సౌధములపై కెగఁబ్రాకుచున్నవి. అవరోధజనమెంతయు నాక్రోశించుచున్నది."

(అందఱు సంభ్రాంతులై చూతురు.)

రాజు :—ఏమీ! అంతఃపురమం దగ్నిహోత్రమా! (కంగారుతో లేచి) హా! కష్టము. కష్టము. అంతఃపురమున మహా

రాణి వాసవదత్త తగులఁబడి పోవుచున్నదే! లావాణికాగ్ని హోత్రమున వాసవదత్త దగ్ధురాలయ్యెనని మున్ను గల్పింపఁ బడిన కింవదంతిని సార్థకము చేయుటకా యిప్పుడీ వీతి హోత్రుఁడు విజృంభించుచున్నాఁడు?

వాస :—ఆర్యపుత్రా! రక్షింపుము. రక్షింపుము.

రాజు :—అరరే! వాసవదత్త నాప్రక్కనే యున్నను సంభ్రమ వశమున గుర్తింపనైతిని. (దేవీహస్తమును గ్రహించి కౌఁగిలించుకొని) దేవీ! భయపడకుము, భయపడకుము.

వాస :—ఆర్యపుత్రా! నాకొఱకై నేనఱచుటలేదు. కఠినురాలనై సాగరికను నిగడసంయుత నొనర్చి యంతఃపురమున బంధించితిని. ఆమెను రక్షింపుఁడని మొరవెట్టుచున్నాను.

రాజు :—ఏమీ! సాగరిక మరణింపనున్నదా? ఇదే పోవుచున్నాను.

వసు :—దేవా! నిష్కారణముగ పతంగవృత్తి నవలంబించెద రేల?

బాభ :—మహారాజా! వసుభూతి చక్కఁగాఁ బల్కినాఁడు.

వసం :—(ఉత్తరీయము పట్టుకొని వెనుకకు లాగుచు) ప్రభూ! అతి సాహస మాచరింపకుము.

రాజు :—(ఉత్తరీయము లాగికొనుచు) ఛీ. మూర్ఖుఁడా! సాగరిక మరణింపనున్నది. ఈ తరుణమునఁగూడ నాప్రాణ రక్షణమా! (మంటలో దూకి పొగలు గ్రమ్ముట నటించును.) ఓ వీతిహోత్రమా!

పొగలు విరజిమ్మనేల ; నద్భుతవిధమ్ము
జ్వాలలను జూచి భయపడి తూలిపోను ;
విరహవహ్నికి రవ్వంత వెఱగుపడని
నన్ను దహియింపఁ గలవొకో ; సన్నుతాంగ.

వాస :—ఏమీ ! దుఃఖకారిణియగు నామాటల మూలమున ప్రభువు లతిసాహసమున కొడిగట్టినారు. ఇఁక నేనుగూడ నార్యపుత్రునే యనుసరించెద.

వసం—(ముందు నిలఁబడి) అమ్మా! నేను తనకు మార్గోపదేశకుఁడ నయ్యెద.

వసు :—ఏమీ ! వత్సభూపతి అప్పుడే మంటలో నురికినాఁడే! రాజపుత్రీవిపత్తిని గనులారఁ గాంచియున్న యీమంద భాగ్యుఁడుకూడ నీ వీతిహోత్రున కాహుతియగుటలెస్స.

బాభ్ర :—(ఏడ్చుచు) మహారాజా ! నిష్కారణముగ భరత వంశమును సంశయతుల నెక్కించుచున్నారు. అథవా ! ఇఁక మాటలతోఁ బనేమున్నది. ప్రభుభక్తికి సదృశముగ నేను ప్రవర్తించెదను.

(అందఱు నగ్నిప్రవేశము గావింతురు.)

రాజు :—(దక్షిణబాహుస్పందము నిరూపించి) ఇట్టి స్థితిలో నున్న నాకీ శుభశకునఫలిత మెటనుండి లభించును ? (ముందుకుఁ జూచి హర్షోద్వేగములతో) ఏమీ ! సాగరికను మంట లావరించనే యావరించినవి. త్వరగాఁ బోయి కాపాడెదను.

(నిగడసంయుతయగు సాగరిక ప్రవేశించును.)

సాగ :—(నలుదెసల వీక్షించి) అయ్యో ! వీతిహోత్రుఁడు సర్వతోముఖముగఁ బ్రజ్వరిల్లుచున్నాఁడే ! ఇఁక నీయగ్ని హోత్రుఁడే నా కష్టములఁ గట్టెక్కింపఁగలఁడు.

రాజు :—(త్వరగా సమీపించి) ఓ ప్రియురాలా ! ఇంకను దట్టముగ నూరకుండెదవేల ?

సాగ :—(రాజును జూచి తనలో) ఏమీ ! ఆర్యపుత్రుఁడా ! ఇతనిని గాంచినంతనే తిరిగి నాకు జీవితముపై నాశ వొడముచున్నది. (ప్రకాశముగ) ప్రభూ ! రక్షింపుము. రక్షింపుము.

రాజు :—భీరు ! భయపడకుము. (సాగరికను బట్టుకొని నిమీలితాక్షుఁడై స్పర్శసుఖ మనుభవించుచు) ఆహా ! క్షణకాలములో నా సంతాపమంతయు సమసిపోయినదే ! ప్రియురాలా ! ఊరడిల్లు మూరడిల్లుము. సంతాపమును సైతము సమయింపఁజేయు శీతల స్పర్శగల నిన్నీహుతాశనుఁ డెంత పెనగులాడినను దహింపఁజాలఁడు సుమా ! (కన్నులు తెఱచి చూచి) ఏమిది? ఆశ్చర్యమాశ్చర్యము. ఈమంట లేమైనవి? ఈ హుతాశనుఁ డేమైనాఁడు. ఊహాతీతముగ నున్నదే !

వాస :—(ప్రభుశరీరము పరామర్శించుచు సంతోషముతో) అదృష్టవశమునఁ బ్రభువు లక్షతశరీరులై యున్నారు.

రాజు :—ఇతఁడు బాభ్రవ్యుఁడా ?

బాభ్ర :—మహారాజునకు విజయము. దేవా ! అదృష్టవంతులము. అందఱము చచ్చి బ్రతికితిమి.

రాజు :—ఇతఁడు వసుభూతియా !

వసు :—ప్రభూ ! అదృష్టవంతులరు.

రాజు :—ఇతఁడు వసంతకుఁడా !

వసం :—ప్రభువులకు జయమగుగాక.

రాజు :—(ఆలోచించి) ఇదంతయు స్వాప్నికమా ! లేక ఇంద్రజాలికమా !

వసం :—ప్రభూ ! సందేహింపవలదు. ఇంద్రజాలికమే యిది. ఆదాసీపుత్రుఁ డప్పుడు చెప్పనే చెప్పినాఁడు. ప్రభువులు దర్శింపవలసిన ప్రదర్శన మింకొక్కటి మిగిలి యున్నదని. అది యిదే యై యుండును.

రాజు :—దేవీ ! నీ యానతి చొప్పున నిదిగో సాగరిక నిటకుఁ దోడ్కొని వచ్చితిని.

వాస :—(నవ్వి) మహారాజా ! తమసంగతి సర్వము నవగతమైనది.

వసు :—(సాగరికను జూచి ప్రక్కకుఁ దిరిగి) బాభ్రవ్యా ! ఈమె అంతయు రాజపుత్రివలె నున్నదికదా !

బాభ్ర :—అమాత్యవరా ! నేనును నట్లే తలంచుచున్నాను.

వసు :—(ప్రకాశముగ రాజు నుద్దేశించి) మహారాజా ! ఈ కన్యక యిూకెక్కడిది ?

రాజు :—వాసవదత్తకుఁ దెలియును.

వసు :—మహాదేవీ ! ఈకన్యక యిూకెక్కడిది ?

వాస :—అమాత్యశేఖరా! సాగరమునుండి దొరకినదని యమాత్యయౌగంధరాయణుఁ డీమెను నాకప్పగించినాఁడు. కనుకనే యీమెను సాగరిక యని పిలుచుచున్నారము.

రాజు :—(తనలో) ఏమీ! అమాత్య యౌగంధరాయణుఁ డప్పగించినాఁడా? అతఁ డేపనిని నను నాతోఁ జెప్పక చేయఁడుకదా!

వసు :—(ప్రక్కకుఁ దిరిగి) బాభ్రవ్యా! వసంతకుని మెడలో నున్న రత్నహారము, సాగరమునుండి యీమె దొరకుట యీరెంటిని బరిశీలింపఁగా నీమె నిజముగ సింహళేశ్వర దుహితయగు రత్నావళియే. (రత్నావళిని సమీపించి ప్రకాశముగ) ఆయుష్మతీ! రాజపుత్రీ! రత్నావళీ! నీవిట్టి దుస్థితిఁ బొందియుంటివా?

సాగ :—(వసుభూతిని జూచి యేడ్చుచు) అమాత్యశేఖరుఁ డైన వసుభూతియా యితఁడు?

వసు :—హా. హతోస్మి! హతోస్మి. (అని భూమిపైఁ బడును.)

సాగ :—హా హతాస్మి హతాస్మి. ఓ తలిదండ్రులారా! మీ రెచ్చట నుంటిరి? బదులు పలుకరేమి? (మూర్ఛపోవును.)

వాస :—(కంగారుతో) కంచుకీ! ఈమె నాసోదరియగు రత్నావళియా!

బాభ్ర :—దేవీ! అవును.

వాస :—(రత్నావళిని కౌగిలించుకొని) సోదరీ! దుఃఖింపకుము. దుఃఖింపకుము.

రాజు :—ఉదాత్తవంశప్రభవుఁడును సింహళేశ్వరుఁడు నగు విక్రమబాహుని పుత్త్రియా యీమె !

వసం :—(తనలో) ఈమెను జూచినప్పుడే ఉదాత్తవంశసంజాత యని నేను గ్రహించినాను.

వసు :—(లేచి) ఓరాజపుత్త్రీ ! దుఃఖింపకుము. నీసోదరి వాసవదత్తాదేవి నీకై మిక్కిలి పరితపించుఁగలదు. ఆమెను కౌఁగిలించుకొనుము.

రత్నా :—(కొంచెము సేపటికి తిర్యగ్విలోకనములతో రాజును దిలకించి తనలో) సాపరాధనగు నేను మహారాణి ముఖము చూడలేకున్నాను. (అధోముఖియై యుండును.)

వాస :—(కన్నీటితో, చేతులు జాపి) ప్రియభగినికా ! రత్నావళీ ! రమ్ము. భగినీస్నేహము ప్రదర్శింపుము. (అని కౌఁగిలించుకొనును.)

(రత్నావళి తొట్రుపడుచుండును.)

వాస :—(ప్రక్కకుఁ దిరిగి) ఆర్యపుత్త్రా ! నా కాఠిన్యమునకు నేనే సిగ్గుపడుచున్నాను. కావున శీఘ్రముగ తమ రీపె బంధమును వదలింపుఁడు.

రాజు :—(సంతోషముతో) చిత్తము. (సాగరికాబంధవిమోచన మొనర్చును.)

వాస :—ఆర్యపుత్త్రా ! యౌగంధరాయణుని మూలముగ నేనింత దుర్మార్గురాలనైతిని. తెలిసియుండియు నతఁడు నాకుఁ జెప్పియుండలేదు.

(యౌగంధరాయణుఁడు ప్రవేశించును.)

యౌగం :—ప్రభువులు బడయనున్న సార్వభౌమపదవీలాభము వాసవదత్తా దేవికిని సంతోషదాయకమే యగునన్నతలం పుతో నేనే రాజదంపతుల ప్రణయకలహమునకును, విప్ర యోగమునకును గారణమైతిని. అన్యకళత్రసంఘటన మూల మునఁ గలిగిన యీ వాసవదత్తాదుఃఖమునకును నేనే కారణ మైతిని. ఇట్టివాఁడ నగుటచే నిప్పుడు రాజదంపతులఁ జూచు టకు ముఖము చెల్లకున్నది. అయినను ఏమి చేయుదును ? స్వామి భక్తివ్రతము మానవీయులమైనఁ గూడ నిరనురోధ వృత్తియై యుండునుగదా! (నిరూపించి) ప్రభువు లిచ్చటనే యున్నారు. సమీపించెదనుగాక. (సమీపించి) మహా రాజా! జయము జయము. (పాదములపైఁ బడి) దేవా! తమకు విన్నవింపకయే స్వేచ్ఛాచారినై చేసిన దానిని క్షమింపఁగోరెదను.

రాజు :—విన్నవింపక చేసిన దేమున్నది ? చెప్పుము.

యౌగం :—సావధానముగ నాలకింపుఁడు. జరిగినదంతయు నామూలాగ్రముగ నివేదించెదను.

(రాజుతోఁగూడ నందఱు తమతమ యాసనముల నలంకరించి యుందురు.)

యౌగం :—ప్రభూ! అవధరింపుఁడు. ఈమె సింహళేశ్వరుని పుత్రిక. రత్నావళి. ఈమెను జెట్టఁబట్టినవాఁడు సార్వభౌముఁ

దగునని కొంకాన్తిక సిద్ధవచనము గలదు. దానియందలి ప్రత్యయముచే, తమకే యీమె నిప్పింపవలెనని యెన్నియో విధముల సింహళేశ్వరుని బ్రార్థించియుంటిని. కాని వాసవదత్తాచిత్తభేదము శంకించుచు నతఁడిందుల కంగీకరింపఁడయ్యె.

రాజు :—అప్పుడేమి చేసితివి ?

యౌగం :—(సిగ్గుతో) లావాణికవహ్నిమూలమున వాసవదత్త దగ్ధురాలయ్యెనని కింవదంతిని గల్పించి "ఇప్పుడైనను రత్నావళిని మాప్రభువుల కొసంగవలె" నని మన బాభ్రవ్యునిచే సింహళేశ్వరునకుఁ గబురంపి యుంటిని.

రాజు :—యౌగంధరాయణా ! తరువాత సమాచారము నేనెఱింగినదే లెమ్ము. సరే. ఈమెను మహారాణి కప్పగించుటలో నీ యాలోచన మేమై యుండును ?

వసం :—ప్రభూ ! దీని యభిప్రాయము నేను గ్రహించినాను. తెలియుచునే యున్నదిగదా ఈమె నంతఃపురమున నుంచి నచో నతిసులభముగ ప్రభువు లీమెను జూడఁగలరని.

రాజు :—యౌగంధరాయణా ! నీయభిప్రాయముసే యీ వసంతకుఁ డుపవర్ణించెనా ?

యౌగం :—దేవా ! చిత్తము. అదే నాయభిప్రాయము.

రాజు :—మఱి యీ యింద్రజాలిక వృత్తాంతముకూడ నీపన్నుగడయేనా ?

యౌగం :—చిత్తము. అది కల్పింపనినాఁడు, అంతఃపురమున

బంధింపఁబడిన సాగరికను ప్రభువులు దర్శించుట దుర్లభము. వసుభూతి యీమెను గుర్తించుటయు దుశ్శకము. (నవ్వి) సోదరియని తెలిసికొన్న పిమ్మట ననంతరకర్తవ్యము మహారాణియే చూచుకొనఁగలదు.

వాస :—(చిఱునగవుతో) యౌగంధరాయణా! రత్నావళి నార్యపుత్రుల కొసంగవలెనని స్పష్టముగనే చెప్పరాదా! (స్వీయాభరణములచే రత్నావళిని చక్కఁగ నలంకరించి యామె చేయి పట్టుకొని రాజును సమీపించి) దేవా! ఈరత్నావళిని స్వీకరింపుఁడు.

రాజు :—(సంతోషముతో చేతులుజాపి) మహారాణి యాజ్ఞయేది శిరసావహింపఁబడదు? (సాగరికను గ్రహించును.)

వాస :—ఆర్యపుత్రా! ఈమె పుట్టినిల్లు కడుంగడు దూరము. కాఁగా స్వీయబంధువర్గమును గూడ విస్మరించునంతటి ప్రేమాతిశయమును తను రీమెయెడఁ బ్రదర్శింపవలెను.

రాజు :—చిత్తము. మహాదేవి యాజ్ఞాపించినట్లే యొనర్చెదను.

వసం :—(సంతోషముతో నాట్యము చేయుచు) పృథివియే యిపుడు మా ప్రభువులకు చేఁజిక్కినదని సంతసించుచున్నాను.

వసు :—రత్నావళీ! వాసవదత్తకు నమస్కరింపుము.

(రత్నావళి నమస్కరించును.)

బాభ్ర :—మహాదేవి! మీ దేవీశబ్దమును సార్థక మొనర్చితిరి.

(వాసవదత్త రత్నావళిని కౌగిలించుకొని
దేవీశబ్దమును బహూకరించును.)

బాభ్ర :—ఆహా! నాపడిన శ్రమయంతయు నిప్పటికి సార్థక
మైనది.

యౌగం :—మహారాజా! ఇంకేమి ప్రియమును గూర్పవలెనో
సెలవిండు.

రాజు :—అమాత్యశేఖరా! ఇంతకన్నను వేఱొండు ప్రియ
మేమున్నది? ఏమన; విక్రమబాహుని నాతో సమానునిగ
నొనర్చితివి. సౌందర్యసారము, భువనప్రాప్త్యేక హేతువు నగు
సాగరికను నాకుఁ జేకూర్చితివి. భగినీలాభముచే వాసవ
దత్తకు మహానందమును గల్పించితివి. కోసలదేశముల
జయింపఁజేసితివి. నీవు ప్రధానామాత్యుఁడవై యుండఁగా
నేను గోరవలసిన దింకేముండును? అయినను నిట్లగుఁగాక.

భరతవాక్యము.

వాసవుపేర్మిచే సకలభారతభూమి సుభిక్ష గావలెన్
భూసురయజ్ఞయాగముల మోదము దేవత లొందఁగావలెన్
వాసిచెలంగ సజ్జనుల భాసురమైత్రి తిరంబు గావలెన్
మాసినకాంతి దుర్జనవిమర్శన లంతము నొందఁగావలెన్.

(అందఱు నిష్క్రమింతురు.)

శ్రీః

సమాప్తము.



| | |
|---|---|
| మాళవికాగ్నిమిత్రము | రు. 1–8.. |
| రత్నావళి | 1–8- |

సంస్కృతకళాపూర్ణోదయము - గద్యకావ్యము.

(అచ్చుకానున్నది)

వలయువారు:—

వై. మల్లికార్జునరా

వైస్ ప్రిన్సిపాల్,

ఎ. డబ్ల్యు. సంస్కృతకళాశాల

రాజమండ్రి.

